Photo by V. R. Ramani, B. A.



బహుమతి
పొందిన వ్యాఖ్య

'నువ్వు పలికితే....

పంపినవారు:
K. S. R. రావు - మలకాపురం

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



ఇవి గాక ఫొటోశీర్షికల పోటీ, మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.




జె. బి. మంఘారాంవారి

# ఎనర్జీ ఫుడ్

## బిస్కత్తులు

తొక్కుడుబండి నడపటానికి పిల్లలు ఎంత సరదాపడతారో—
జె. బి. ఎనర్జీ ఫుడ్ - బిస్కత్తులు తినడానికి అంత
సరదాపడతారు. ఇవి జవము, జీవము, పుష్టినీ ఇచ్చును.

సౌఖ్యమైన సంసారములకు హితకరమైన బిస్కత్తులు

**జె. బి. మంఘారాం అండ్ కంపెనీ,**
గ్వాలియర్ & హైదరాబాదు





◀ కీళ్ల నొప్పులా?



కొంచెం

**అమృతాంజనము**

రాయండి



◀ వెంటనే గుణం
కనిపిస్తుంది.




మీకు అమృతాంజనము ఎప్పుడు కావలసివస్తుందో మీకే తెలియదు.
ఇంట్లో ఎప్పుడూ ఒక బుడ్డిని ఉంచండి. ఎంతైనా నమ్మకమైనది.

అమృతాంజన్ లిమిటెడ్

**14/15, లజ్ చర్చి రోడ్డు, మద్రాసు-4 బొంబాయి-1, కలకత్తా-1, న్యూ ఢిల్లీ-1**

JWT-AMI 1091a

# పాఠకుల లేఖలు

## జనవరి 1961

[ఈ సంచికనుంచి "పాఠకుల లేఖలు" అనే శీర్షిక ప్రారంభించుతున్నాము. "చందమామ" లో నెలనెలా వెలువడే కథలూ, సీరియల్ కథలూ, శీర్షికలూ గురించి పాఠకులు తమ అభిప్రాయాలను సంగ్రహంగా రాసి పంపినట్టయితే వాటిని ఈ శీర్షికలో ప్రచురించగలము. —సంపాదకుడు.]

### "కందు లేదు!"

అందమైన యా చందమామలో
గందు యుండ కనుచుంటిమి కాని
దీపావళి మా దివ్యమామలో
గందు లేదు యిల మందునకైన
—ప్రకృతి కిది విరుద్ధమేమో ?

—పి. గోపాల్, పార్లి

### "చందమామ" హాయి

ఆనందింపజేసే పిల్ల తెమ్మెరలను అన్వేషిస్తూ మేఘమాలికలను చుంబన చేస్తూ, ప్రపంచాన్ని మైమరపించే ఆ చందమామకు వున్న హాయి ఈ "చందమామ"కు ఎలాగ చేకూర్చుతున్నావు, మామయ్యా!

—కె. రవిశంకర్, ఎం. ఎం. పాడు

### ఎదురు తెన్నులు

మై డియర్ చందమామ, స్వాతివాన ముత్యము చిప్పలాగా ప్రతినెలా నీకోసం ఎదురుచూస్తూ వుంటాము....పౌర్ణమి నాటి రేయి ఎంత హాయిగా ఉంటుందో, "చందమామ" వచ్చిన రేయి అంత హాయి....

—మల్లంపల్లి విశాలాక్షి, తణుకు

### సూచన

"చందమామ"లో మహాభారతము యధాతధంగానే ఒక పేజీయే ప్రకటించిన బాగుండునని మా అభిప్రాయము

—వెనిగళ్ళ కృష్ణమూర్తి, ఇందుపల్లి

[ఈ మార్పు ఫిబ్రవరి సంచికనుంచి జరుగుతుంది. ఈ సంచికలోనే భారతం అట్టచివరి బొమ్మ కథ అయింది. —సం.]

### చుక్కల్లో చంద్రుడు

గగనసీమ అనెడి అఖిలభారతంలో తారల వలె తళతళ మెరిసే "చందమామ" పాఠకుల చెంత తేజోవంతముగా తేలియాడుతూ, విజ్ఞానం అనెడి చల్లని వెలుగును ప్రసాదిస్తున్న "చందమామ"కు నా శుభాశీస్సులు.

—కొప్పాడ రామారావు, విశాఖపట్టణం

### వాష్ డ్రాయింగులు

మీరు దీపావళి సంచికలో "రత్నావళి"లో చిత్రించిన వాష్ డ్రాయింగుల వంటి చిత్రములు ప్రతినెల ఒక కథకు వేసి పాఠకుల కందించెదరని ఆశిస్తు వున్నాము

—కామిశెట్టి లక్ష్మీనారాయణ, కోడూరు

[ఈ పద్ధతి ఈ సంచిక నుంచి అమలుచేస్తున్నాము. —సం.]



# నేను కొత్త టినోపాల్ పిల్లని

ఇప్పుడు ప్రతి చోట అమ్మకమునకున్న

# టినోపాల్ బివిఎన్

ఆకర్షణీయమైన కొత్త కార్టన్ మీద మీరు నా బొమ్మను చూస్తారు




నూలు మరియు రేయాన్‌లను తెల్లగా చేసేదైన, మీ తెల్ల దుస్తులను మెరిసిపోయేలా తెల్లగా చేసి మీకు సుపరిచితమైన టినోపాల్ బి వి ఎన్ ఇప్పుడు ఆకర్షణీయమగు ప్రత్యేకమైన కార్టనులో లభిస్తోంది. కొత్త కార్టను ముఖ్యమైన రంగు నీలిరంగు. పై మూత మీద నా బొమ్మ వివిధ రంగులలో ఉంది. క్రింది మూత మీద నాణ్యతకు పేరుగాంచిన గెయిగి మరియు ఎస్ జి ట్రేడు మార్కులు ఉన్నాయి.

కంటెయినర్ : కార్టను లోపల పారదర్శకమైన ప్లాస్టిక్ కంటెయినర్ చోరనిరోధకమైన ధూమ్రవర్ణపు అల్యూమినియం సీలుచేయబడి మూయబడి ఉన్నది.

నెట్ బరువు: ఇది వరకు 1 ఔన్సుకు బదులు ఇప్పుడు 25 గ్రాములు మరియు ఎప్పటివలె జ్ఞాపకముంచుకోండి....

కొంచెము టినోపాల్ తెల్లని దుస్తులను అన్నిటికన్న తెల్లగా చేయును




తయారుచేయువారు : సుహృద్ గెయిగి ప్రైవేట్ లిమిటెడ్, వాడి వాడి బరోడా

ఏకైక డిస్ట్రిబ్యూటర్లు : సుహృద్ గెయిగి ట్రేడింగ్ ప్రైవేట్ లిమిటెడ్, పో. బా. నెం. 965, బొంబాయి 1

టినోపాల్ జె. ఆర్. గెయిగి, ఎస్. ఏ. బాస్లె, స్విట్జర్లెండ్ వారి రిజిస్టరుచేయబడిన ట్రేడు మార్కు.



SISTA'S-SG-120 TEL.

# ఇప్పుడు
# మీకు ప్రియమైన
# ఆరోగ్యముచేకూర్చే
# విటమినులు కలిసిన
# వాటర్‌బరీస్ కాంపౌండ్
# తీసుకోండి

భారతదేశమందు మిక్కిలి ప్రియమగు, అమూల్యమైన విటమినులతో కూడిన టానిక్కును మీరు యిప్పుడు కొనగలరు. ప్రఖ్యాతి గాంచిన వాటర్‌బరీస్ కాంపౌండ్ ఫార్ములాలో ఆరోగ్యమును, పుష్టిని కలిగించెడు అనేక విటమినుల చేర్పబడినవి. వాటర్‌బరీస్ విటమిన్ కాంపౌండ్ మీకు అనేక విధములుగా మేలు కలుగజేయును. ఇది రక్తమును వృద్ధిచేసి, కోల్పోయిన శక్తిని మరల చేకూర్చి, మీకు ఉత్సాహము నిచ్చును. ఇది నరములకు సత్తువ కలుగజేసి కండరముల అభివృద్ధికి తోర్పడుటయేగాక వ్యాధులను కూడా నిరోధించును. జబ్బు చేసిన తరువాత త్వరగా స్వస్థత పొందుటకు యిది చాలా సహాయపడును.




## వాటర్‌బరీస్
### విటమిన్
## కాంపౌండ్

మీ ఆహార పోషణను పూర్తి చేయును.



దగ్గు, జలుబులకు క్రియోసోట్ మరియు గ్వైకాల్‌తో కూడిన వాటర్‌బరీస్ కాంపౌండ్ ఎఱ్ఱ లేబిల్ గల సీసాలో కూడా లభించుచున్నది.

మీరు మీ ఊరిలో మా "చందమామ" అమ్మే చిన్న ఏజంటుగా వుండవచ్చును. దీనికి మీరు మనిఆర్డరు ద్వారా రు. 3-00 పంపిన 8 "చందమామ" కాపీలు మీకు సప్లయి చేస్తాము. లేదా ప్రారంభంలో 4 కాపీలు మాత్రం చాలంటే రు. 1-50 పంపండి. ప్రతికి 12 నయా పైసలు చొప్పున మీకు లాభిస్తుంది. అయితే డబ్బు పంపేముందు మీ ఊరిలో ఇప్పటికే మా ఏజంటు ఎవరూ లేరు అనే విషయం రూఢిచేసుకోండి.



## చందమామ పబ్లికేషన్సు
వడపలని :: మదరాసు - 26

# దానిని కొరకండి మీకెంతో ఇష్టమగును

ప్రపంచమందలి శ్రేష్ఠమైన కోకొబీన్సు, పాలు మరియు అతి సన్నని రేణువులుగా గుండ చేయబడిన కంద చక్కెరతో ఆకర్షణీయ సువాసన గాను, పరిపక్వ రుచిగాను తయారు చేయబడి నవి. అది నోట్లో వేసుకోగానే కరిగిపోవును మరియు మీకు అధిక పుష్టిదాయకమైనది.







# సాఠే చాకొలెట్‌లు

సాఠె బిస్కట్ అండ్ చాకొలెట్ కం. లి., పూనా-2

Heros'-121 TEL



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

ఈ సంచికలో "శమంతకమణి" అనే కొత్త గేయ కథ ప్రారంభమవుతున్నది. ఇదికూడా "గంగావతరణం", "క్షీరసాగర మథనం" లాగే శ్రీ ఉత్పల సత్యనారాయణాచార్యగారి రచన. రసవత్తరమైన ఈ గేయకథను కూడా "చందమామ" పాఠకులు ఉత్సాహంతో చదువుతారని ఆశిస్తున్నాం.

"కొయ్యగుర్రం" అన్న రంగుల బొమ్మ సీరియల్ కూడా ఈ సంచికతో ప్రారంభమవుతున్నది. కొంత కాలం క్రితం ప్రచురించిన "కీలుగుర్రం" కథకూ దీనికి కొద్ది పోలిక ఉన్నా ఈ కథ పూర్తిగా కొత్తది.

ఈ సంచిక అట్టమీది బొమ్మ కాళిదాసు నాటక కథ "శకుంతల" లోని ఒక ఘట్టాన్ని చిత్రిస్తున్నది. కళాకారుడు శ్రీ వడ్డాదిపాపయ్య. అట్టచివరి బొమ్మ భారతకథకు సంబంధించినది.

సంపుటి 28 : జనవరి 1961 : సంచిక 1






పాండవయోధుడైన ఘటోత్కచుడు చని పోగానే కౌరవసేనలో ఉత్సాహం పెరిగింది. ద్రోణుడూ, కర్ణుడూ పెచ్చురేగి యుద్ధం సాగించారు. పాండవ యోధులందరూ ద్రోణుణ్ణి చంపే ఉద్దేశంతో ఒక్కసారిగా ముందుకు వచ్చారు.

కాని ద్రోణుడు అద్భుతమైన పరాక్రమం చూపాడు. ఆయన ఆ రాత్రి విరాటుణ్ణీ, ద్రుపదుణ్ణీ, ద్రుపదుడి కొడుకులు ముగ్గురినీ, పాంచాల మత్స్య చేది దేశాల వీరులనూ హతమార్చేశాడు. తన తండ్రిని చంపిన ద్రోణుణ్ణి తాను తప్పక చంపుతానని ధృష్టద్యుమ్నుడు శపథంచేశాడు.

ఆ రాత్రి మూడుజాములకు సైనికులు అలిసి, రథాలలోనూ, గుర్రాలమీదా, ఏనుగులమీదా, ఎక్కడివాళ్లక్కడ నిద్రమత్తుతో జోగసాగారు. వారి దుస్థితి చూసి అర్జునుడు, "సైనికులారా, ఇంకా రెండు ఘడియలలో చంద్రోదయమవుతుంది. అంతదాకా యుద్ధం మాని విశ్రాంతి తీసుకోండి!" అని కేకపెట్టాడు.

అలాగే కౌరవ సైన్యాలు కూడా చంద్రోదయం వరకూ విశ్రాంతి తీసుకున్నాయి. చంద్రోదయంతో మళ్ళీ యుద్ధం ప్రారంభమయింది. మరి రెండు ఘడియలకు సూర్యోదయమే అయింది.

ద్రోణుడి యుద్ధం అతి భయంకరంగా ఉన్నది. ఆయన ఇరవై వేల పాంచాల రథికులనూ, అయిదు వందల మాత్స్యులనూ, ఆరు వేల సృంజయులనూ, అనేక వేల ఏనుగులనూ, గుర్రాలనూ చంపాడు. ఈ దారుణ హత్యాకాండ చూసి కృష్ణుడు పాండవులతో, "మీరు అన్యాయంగానైనా సరే ఈ ద్రోణుణ్ణి చంపకపోతే మనందరికీ చావు తప్పదు. అశ్వత్థామ చచ్చాడని వింటే ఆయన అస్త్రం విసర్జిస్తాడు," అని సలహా చెప్పాడు.

భీముడు ద్రోణుడికి దగ్గిరిగా వెళ్లి, "అశ్వత్థామ చచ్చె," అని గట్టిగా అరిచాడు. ద్రోణుడి గుండె గుబుక్కుమన్నది. కాని భీముడి మాట నమ్మలేక ఆయన ధర్మరాజుతో, "ఈ మాట నిజమేనా?" అన్నాడు. ధర్మరాజుకు అబద్ధం ఆడటం సమ్మతం కాకపోయినా మిగిలినవారి ప్రోద్బలంచేత, "అశ్వత్థామ చచ్చిన మాట నిజమే!" అని గట్టిగా అని, "అశ్వత్థామ పేరు గల యేనుగు," అని మెల్లిగా గొణిగాడు. నిజానికి ఆ పేరు గల ఏనుగు ఒకటి అదివరకే చచ్చిపోయింది.




ద్రోణుడికి మతిపోయినట్టయింది. ఇంతలో ధృష్టద్యుమ్నుడు ఆయనమీదికి వచ్చాడు. ద్రోణుడికి ఒక్క అస్త్రమూ స్ఫురణకు రాలేదు. ఆయన మామూలు బాణాలతోనే ప్రచండమైన యుద్ధం చెయ్యసాగాడు. చివరకు భీముడు ఆయన దగ్గిరికి వెళ్ళి, "నీది బ్రాహ్మణ జన్మ, నీ కొడుకు చచ్చిపడి ఉన్నాడు, ఇంకా ఈ హత్యాకాండ మానవు! నీకు లజ్జ లేదా!" అన్నాడు.

ఆ మాటలతో ద్రోణుడు శస్త్రసన్యాసం చేసి, రథంమీద కూర్చుని, యోగనిష్ఠలో ఉండిపోయాడు. ఆ సమయంలో ధృష్టద్యుమ్నుడు కత్తి పట్టుకునివచ్చి, ఒక చేత్తో ద్రోణుడి తెల్లని జుట్టు పట్టుకుని, రెండవ చేత్తో మెడ నరికేశాడు. "వద్దు, వద్దు!" అని అర్జునుడూ, సాత్యకీ పెట్టిన కేకలను అతను లక్ష్యపెట్టలేదు.

ఈవిధంగా ద్రోణుడు తాను కౌరవసేనలకు సర్వసేనాని అయిన అయిదో రోజు అపరాహ్ణం ధృష్టద్యుమ్నుడి చేతిలో చచ్చిపోయాడు. ఆయన చావుతో పాండవపక్షంలో ముసలం పుట్టినట్టయింది. అర్జునుడూ, సాత్యకీ మండిపడిపోయి ధృష్టద్యుమ్నుణ్ణి చంపబోయినంత పని చేశారు. భీముడూ, కృష్ణుడూ ద్రోణ హత్యను సమర్థించారు. వారి మధ్య ఎలాగో రాజీ జరిగింది.

ఇక, ద్రోణుడి చావుతో కౌరవసేనలో కలిగిన సంక్షోభం వర్ణనాతీతం. మహారథులు సయితం పులిని చూసిన లేళ్ళలాగా పారిపోసాగారు. ఇలా బెదిరి పారిపోతున్న కౌరవసేనలకు ఎదురుగా అశ్వత్థామ వచ్చాడు. అతనికి మొదట ఏమీ అర్థంకాలేదు. కృపాచార్యుడు అతనికి జరిగిన సంగతి తెలిపాడు.

తన తండ్రి చచ్చిపోయినందుకు అశ్వత్థామ అంతగా చింతించలేదు; అంతటి యోధుణ్ణి ధృష్టద్యుమ్నుడు జుట్టు పట్టుకుని తల నరికాడంటే అది అతనికి భరించరాని అవమానంగా తోచింది.

ఆ క్రోధోద్రేకంలో అతను పాండవులపై తనవద్ద నున్న నారాయణాస్త్రం ప్రయోగించాడు. నారాయణాస్త్రం నేలపై నిలిచిన వారినీ, యుద్ధవిముఖులనూ చంపదు; వాహనాలలో ఉండేవారినీ యుద్ధోద్రేకం కల వారినీ మాత్రమే చంపుతుంది. ఈ సంగతి తెలిసి కృష్ణార్జునులూ, మిగిలిన యోధులూ రథాలనుంచి దిగి నేలపై నిలబడి నారాయణాస్త్రానికి నమస్కారం చేశారు. ఒక్క భీముడే మూర్ఖించి రథం దిగలేదు. అతన్ని నలుగురూ బలవంతంగా పట్టి కిందికి లాగారు. నారాయణాస్త్రం అణగిపోయింది.

ఇంత మహాస్త్రం ఏ ఒక్క యోధుణ్ణీ బలి తీసుకోకుండా అంతరించినందుకు అశ్వత్థామ హతాశుడయాడు. అంతలో సూర్యాస్తమయమయింది. పదిహేనో రోజు యుద్ధం ముగించి ఉభయపక్షాలవారూ తమ శిబిరాలకు వెళ్ళిపోయారు.

ఈరోజు యుద్ధంలో అర్జునుడికి ఒక విచిత్రమైన అనుభవం కలిగింది. ఒక శూలపాణి అయిన వ్యక్తి తన ముందు నడుస్తూ అంతులేని సైన్యాలను చంపుతూ వచ్చాడు. తానే వారినందరినీ చంపుతున్నట్టు అందరూ అనుకున్నారు. ఆ విధంగా తన ముందు నడిచినది సాక్షాత్తూ శివుడేనని అర్జునుడు వ్యాసుడిద్వారా తెలుసుకున్నాడు.





# శమంతకమణి

ప్రథమాశ్వాసము :

అది వినాయక చవితి పండుగ.
ఆ దినమ్మున ద్వారకాపురి
జనులు వేడుకలందు మునిగిరి;
కనుల పండుగ చేయుచుండిరి.

ఇళ్ళ ముంగిట మంచిగంధపు
నీళ్ళతో కలయంపి చల్లిరి;
ముత్యములతో రకరకాలుగ
ముగ్గులను వాకిళ్ళ దీర్చిరి.

గడప గడపకు పసుపు కుంకుమ
కమ్మ కస్తురి కలిపి పూసిరి;
ద్వారబంధములందు మంగళ
తోరణమ్ములు వ్రేలగట్టిరి.

పళ్ళెరములను బట్టి పడతులు
పయనమై ఇండ్లిండ్ల కేగిరి;
పండుగకు పూబోండ్ల పిల్చుచు
పసుపు కుంకుమ పాళ్ళు పెట్టిరి.

ఎలుకవాహన మెక్కి మురియుచు
ఎల్ల గృహముల వెలసె గణపతి;
కుడుము లుండ్రా ళ్ళారగింపగ
కుదురుగా కూర్చుండె గణపతి.

రేగులును మారేడు జమ్ములు
రెమ్మలను, దానిమ్మయాకుల
పలు తెఱంగుల పువ్వు లాకుల
పండ్లతోడుత పూజ చేసిరి.

కడుపు నిండ గణేశమూర్తికి
కుడుములును ఉండ్రాళ్ళు పెట్టిరి;
సర్వ సిద్ధుల నొసగు మంచును
సాగిలంపడి జనులు మ్రొక్కిరి.

నాటి పండుగదినమునందున
నందగోపుని భవనమందలి
వైభవము వర్ణించి చెప్పగ
వాక్కు చాలదు! వాయి చాలదు!

ఉత్పల సత్యనారాయణాచార్య



అచట కృష్ణుని పూజలను గొన,
ఆ మహాత్ముని చూడదలచియు,
స్వయముగా విఘ్నేశు డచటికి
సరగ వచ్చిన యట్టులుండెను!

లేత కొబ్బరికాయ లెన్నియొ
నేతి కుడుములు, అరటిపండ్లును,
వెన్న మీగడ పాల కడవలు
విఘ్ననాయకు నెదుట పెట్టిరి.

తన్నకు నొక విడాదివఅకును
తగిన తినుబండారములు గని,
కనుల పండువు గాగ గణపతి
తనదు పండుగ చేసికొనియెను.

అష్టభార్యలు కృష్ణమూర్తికి
అగుదురని దీవించె గణపతి;
నీవు సాక్షాల్లక్ష్మి వంచును
దేవి రుక్మిణి బొగడె గణపతి.

పేరటాండ్రకు పసుపు కుంకుమ
చీర అవికలు పూల పండ్లను
పేరుపేరున వేడ్కతోడుత
పిలిచి యొసగెను రుక్మిణీసతి.

బ్రాహ్మణులకును కృష్ణు డప్పుడు
పాడియావుల దాన మొసగెను;
తనదు సేవక జనులకెల్లను
తగిన కానుక లిచ్చి పంపెను.

రుక్మిణియె వడ్డించుచుండగ
రుచులు మెచ్చుచు వారలందఱు
పంచభక్ష్యము లుండరాళ్ళను
పాయసాన్నము లారగించిరి.

విఘ్ననాయకు కథలు చెప్పుచు
వేడ్కతోడుత ప్రొద్దుపుచ్చిరి;
సంజ సమయమునుండి వెన్నెల
సన్న సన్నగ కాయుచున్నది.

రేయి చుక్కల త్రోవలో నా
రింజ తొనవలె చంద్రు డొప్పెను;
చవితి చంద్రుని చూడరాదని
జనులు ఔదల యెత్తకుండిరి.

పాలు పిదికెడి వేళ యైనది;
ఆలమందలు అఱచుచున్నవి;
క్రేపులను విడి పాలు దీయగ
కృష్ణునకు మనసయ్యె నప్పుడు.

స్వర్ణకలశము రుక్మిణీసతి
సంతసమ్మున నొసగ కృష్ణుడు
అందుకొని, చిఱునవ్వు మోమున
చిందిపోవగ పాలు తీసెను.

పాల చెంబున చవితి చంద్రుని
లీలగా గని వగచె కృష్ణుడు,
ఎట్టి నిందలు వచ్చునో యని,
ఏ కళంకము కలుగునో యని.

నిదుర పట్టక నాటి రాతిరి
నిందగూర్చి విచారమొందెను;
ప్రాణమైనను విడుచుగానీ
మానవంతుడు నిందకోర్చునె!

ప్రళయకాలము దాపురించిన,
జలధులొకటై పొంగి పొర్లిన,
ఎట్టి నింద సహింప నంచును
గట్టి పంతము పూనె కృష్ణుడు.

అంతలోననె తెల్లవాఱెను;
ఆలమందలు అఱవసాగెను;
కట్టుకొయ్యల లేగదూడలు
చుట్టుకొని క్రేళ్ళుఱుకసాగెను.



సూర్య కిరణము లేటవాలుగ
జొచ్చి నిగ్గులు సాగుచుండెను;
తూర్యరవములు ద్వారకాపురి
తోరణమ్ముల మ్రోగుచుండెను.

హంసతూలిక తల్పమందున
హాయిగా పవళించియుండిన
సుందరాంగుని మేలుకొల్పుచు
సుదతు లప్పుడు హారతిచ్చిరి.

మేలుకొని గోపాలకృష్ణుడు
కాలకృత్యము లెల్ల దీరిచి,
తనదు కొలువున స్వర్ణ సింహా
సనమునందున కూరుచుండెను.

అంతలో పదిమంది గొల్లలు
అదురుగుండెల పరుగులెత్తుచు,
గొంగడులు జీరాడుచుండగ
గోకులేశ్వరు సభకు వచ్చిరి.

"నందనందన! యాదవేశ్వర!
వందనములో వ్రజకులేశ్వర!
ఇపుడు మిము గన సూర్యుడో మఱి
ఇంద్రుడో అరుదెంచుచుండెను!

"కన్నులకు మిఱుమిట్లు గొల్పెడి
కాంతితో నిలువెల్ల మెఱయుచు
అగ్నిదేవుడొ యేమొ, ఓ దొర!
అరుగుదెంచుచునుండె నిచటికి."

అనుచు గొల్లలు చతికిలంబడి
ఆ యుదంతమె చెప్పుచుండగ
చెక్కటను చెయి చేర్చి కృష్ణుడు
చక్కగా యోచింపదొడగెను.

ద్వితీయాశ్వాసము:

సత్రాజిత్తనెడివాడు
సాగరతీరమ్మునందు
నిలచి సూర్యభగవానుని
నిష్ఠతోడ పూజించెను.

పదునొకండు దినములకును
భాస్కరుడు ప్రసన్నుడగుచు,
అతని కొక మేలు సేయ
అవతరించె భువిమీదికి.

సంద్రమెల్ల బంగారపు
చాయలతో మెఱసిపోయె!
దిక్కులందు జలతారపు
తెరలు దించినట్టు లాయె!

పచ్చని గుఱ్ఱాలు లాగు
బంగారపు రథముమీద
సూర్యదేవు డరుదెంచెను
చూపులు మిఱుమిట్లు గొలుప!—(సశేషం)






## 13

[చిత్రసేనుడు రాజ్యంలో తల ఎత్తిన బందిపోట్లనూ, దారి దోపిడిగాళ్ళనూ ఎంతో చాకచక్యంతో లొంగదీసుకున్నాడు. ఈలోపల రాణి కాంతిమతి కుమారుణ్ణి కన్నది. వాడికి ఐదేళ్ళు నిండగానే ఉగ్రాకుడు వచ్చాడు. చిత్రసేనుడు అతడికి ఒక బాలుణ్ణి యిచ్చాడు ఆ బాలుడు రాకుమారుడు కాదని ఉగ్రాకుడు తెలుసుకున్నాడు. తరవాత—]

ఉగ్రాకుడు కోటద్వారం దగ్గిరకు రావటం చూస్తూనే అమరపాలుడు చిత్రసేనుడి వద్దకు పరిగెత్తిపోయి, "మహారాజా! ఆ రాక్షసుడు భూమి దద్దరిల్లేలా అడుగులు వేస్తూ, రంకెలు పెడుతూ కోటలోకి వస్తున్నాడు," అని చెప్పాడు.

చిత్రసేనుడు నివ్వెరపోయాడు. రాణి కాంతిమతి వెలవెలపోయింది. "అయితే, ఆ కుర్రవాడెవడైందీ ఉగ్రాకుడు గ్రహించాడన్నమాట!" అన్నాడు చిత్రసేనుడు.

"వాణ్ణి మనం మోసగించలేం, మహారాజా!" అన్నాడు అమరపాలుడు.

"అలాగే తోస్తున్నది," అంటూ చిత్రసేనుడు కాంతిమతికేసి ఓ క్షణకాలం చూసి, "మనం విచారించి లాభంలేదు. నేను అతడికి వాగ్దానం చేసినప్పుడు పరిస్థితులు యీవిధంగా పరిణమిస్తవని వూహించలేకపోయాను," అన్నాడు.

"వాణ్ణి హతమారిస్తేనో, మహారాజా?" అన్నాడు అమరపాలుడు.




"అది అంత తేలిగ్గా సాధ్యమయేది కాదు. ఒకవేళ సాధ్యం అయినా, రాజ్యం అల్లకల్లోలం కావటం, నేను మాట తప్పా ననే అపకీర్తి పొందటం జరిగి తీరుతుంది," అన్నాడు చిత్రసేనుడు.

రాణి కాంతిమతి చప్పున ఆసనంమీది నుంచి లేచి, "మహారాజా! ఆ రాక్షసుడి సంగతి నాకు వదలండి," అంటూ తన గది కేసి వెళ్ళిపోయింది.

ఇంతలో ఉగ్రాక్షుడు రాజప్రాసాదం సమీపించి, "మహారాజా, మహారాజా!" అంటూ గావుకేకలు పెట్టాడు. ఆ కేకలు వింటూనే చిత్రసేనుడూ, అమరపాలుడూ మేడమెట్లు



దిగి కిందికి వచ్చారు. చిత్రసేనుడు ఉగ్రాక్షుడికేసి చిరునవ్వు నవ్వుతూ, "ఏం జరిగింది ఉగ్రాక్షా? మేం నీ సంగతే మాట్లాడుకుంటున్నాం," అన్నాడు.

"మోసం మహారాజా! మీరీ విధంగా ఆడి తప్పుతారని నేననుకోలేదు," అన్నాడు ఉగ్రాక్షుడు భుజంమీది నుంచి కుర్రవాణ్ణి కిందకు దింపుతూ.

"దాసీలవల్ల పొరపాటు జరిగిపోయింది. వాళ్ళు హడావిడిలో నీకు రాజకుమారుడి బదులు మంత్రికుమారుణ్ణి యిచ్చారు," అన్నాడు అమరపాలుడు.

"వీడు మంత్రికుమారుడా? అహ్హహ్హ," అంటూ ఉగ్రాక్షుడు పెద్దగా నవ్వి, కుర్రవాణ్ణి రెండుచేతులతో పట్టి పైకెత్తుతూ, "వీడు వంటవాడి కొడుకు, మంత్రికుమారుడు కాదు. అసలు నాకు కావలసింది చిత్రసేనమహారాజుగారి మొదటి సంతానం. దానికి బదులు ఈ రాజ్యమంతా నా కిస్తానన్నా తీసుకోను," అన్నాడు.

"కొంచెం ఆగు. కుర్రవాడికి మంచి దుస్తులు తొడిగి యిప్పుడే తీసుకువస్తారు," అన్నాడు చిత్రసేనుడు.

క్షణాలమీద దాసీలు చక్కని పట్టుదుస్తులతో అలంకరించిన ఒక కుర్రవాణ్ణి తెచ్చి,








ఉగ్రాక్షుడిముందు నిలబెట్టారు. ఉగ్రాక్షుడు ఆ కుర్రవాడికేసీ, దాసీలకేసీ ఒకటికి రెండు సార్లు పరీక్షగా చూసి, దాసీలతో, "అమ్మాయిలూ, మీరు హడావిడిలో రాజకుమారుడికి బదులు మరెవరినైనా తీసుకురాలేదుగదా?" అని అడిగాడు.

"నీకు అంత అనుమానం అయితే అబ్బాయినే అడుగు," అన్నారు దాసీలు. ఈలోపల చిత్రసేనుడు అక్కడినుంచి వెళ్లిపోయాడు. ఉగ్రాక్షుడు కుర్రవాణ్ణి సమీపించి, వాణ్ణి చేతుల్లోకి తీసుకుంటూ, "నీపేరేమిటి బాబూ?" అని అడిగాడు.

"యువరాజు," అన్నాడు కుర్రవాడు.

దాసీలు పెద్దగా నవ్వుతూ, "అదేం ప్రశ్న ఉగ్రాక్షా? 'నీవెవరి కొడుకువు?' అని కుర్రవాణ్ణి ప్రశ్నిస్తే నిజం బయటపడేది గదా," అన్నారు.

"నన్ను మోసం చేయుదలుచుకుంటే, అలాంటి ప్రశ్నకు వీడు ఎలాంటి జవాబివ్వాలో ముందుగానే మీరు నేర్పివుంటారు. అందుకనే నేను మరోరకం ప్రశ్న అడిగాను. వీడు రాజకుమారుడవునో కాదో తెలుసుకునేందుకు, అడవిలో వీడికొక పరీక్ష వున్నది. ఈసారికూడా మీరు నన్ను మోసంచేసినట్టు బయటపడిందో, మీ దాసీ లందర్నీ ఎత్తుకుపోయి, నా బంట్లకు యిచ్చి పెళ్లిచేసేస్తాను," అన్నాడు ఉగ్రాక్షుడు.

ఉగ్రాక్షుడు అన్న మాటలు విని కొందరు దాసీలు నవ్వుకున్నారు, కొందరు భయపడ్డారు. ఉగ్రాక్షుడు కుర్రవాణ్ణి భుజాన ఎక్కించుకుని అడవిలో ప్రవేశించాడు.

ఉగ్రాక్షుడు అడవిలో కొంతదూరం నడిచిన తరవాత, కుర్రవాణ్ణి రాజకుమారుడవునో కాదో పరీక్ష చెయ్యాలనుకున్నాడు. అతడికి దారిమధ్య వంటవాడి కొడుకు జారవిడిచిన కర్రపుల్ల కనబడింది. ఉగ్రాక్షుడు కుర్రవాణ్ణి భుజంమీదినుంచి దించి, కర్రపుల్లను అతడి చేతికి అందిస్తూ, "ఈ కర్ర





మోసం, ఎంత మోసం! గొర్రెలు కాచేవాడి కొడుకును, రాజకుమారుడని నాకిస్తారా?" అంటూ ఉగ్రాక్షుడు కళ్ళెర్రచేసి, కుర్రవాణ్ణి భుజాన వేసుకుని, హుంకరిస్తూ కపిలపురం కోటకు బయలుదేరాడు.

ఉగ్రాక్షుడు అడవి దాటి కోటముందున్న మైదానంకేసి చూసేసరికి, అక్కడ కొందరు గుర్రపు రౌతులూ, సైనికులూ నిలబడి వున్నారు. వాళ్ళను చూస్తూనే ఉగ్రాక్షుడు, "వీళ్ళందర్నీ చిత్రసేనుడు నామీద యుద్ధానికి పంపలేదుగద," అనుకున్నాడు. కాని, అతడు వాళ్ళను సమీపిస్తున్నకొద్దీ అతడికి రాజభటులముందు నిలబడిన అమరపాలుడూ, అతడి పక్కన పట్టువస్త్రాలు ధరించి ధగధగ మెరిసిపోతున్న ఒక ఐదేళ్ల కుర్రవాడూ కనిపించారు. "వీడు, రాజకుమారుడయి వుంటాడు," అనుకున్నాడు ఉగ్రాక్షుడు తృప్తిగా.

ఉగ్రాక్షుడు అల్లంత దూరంలో వుండగానే అమరపాలుడు పెద్దగా కేకపెట్టి, "ఉగ్రాక్షా! ఇడుగో రాజకుమారుడు. రెండవసారికూడా దాసీలవల్లనే పొరబాటు జరిగిపోయింది. ఏమీ అనుకోకు," అన్నాడు.

"ఈ పొరబాట్లన్నీ దాసీలు చేస్తున్నవా?" అంటూ ఉగ్రాక్షుడు హేళనగా నవ్వి,

పుల్ల నీకిస్తే, ఏంచేస్తావురా, బాబూ?" అని ప్రశ్నించాడు.

"ఇది నాకెందుకు? మా అయ్యకిస్తాను," అన్నాడు కుర్రవాడు. ఉగ్రాక్షుడు ఉలిక్కిపడ్డాడు. మళ్ళీ తనను మోసగించి వుంటారన్న అనుమానం అతడికి కలిగింది.

"మీ అయ్య ఈ కర్రతో ఏంచేస్తాడు?" అని అడిగాడు అతడు.

"మంద విడిచి ఏదన్నా గొర్రె పారిపోవాలని చూస్తే, ఈ కర్రతో దాని కాళ్ళు విరగేస్తాడు," అన్నాడు కుర్రవాడు.

"అరె కుంభకర్ణుడా! నువ్వు రాజుగారి గొర్రెలు కాచేవాడి కొడుకువన్నమాట! ఎంత



"అయితే, నువ్వు ఈసారి పొరబాటు పడి ఎవరబ్బాయిని యివ్వబోతున్నావు?" అని అడిగాడు.

"ఈ కుర్రవాడు ఎవరో కాదు, యువరాజు, చిత్రసేన మహారాజు ప్రథమ సంతానం!" అన్నాడు అమరపాలుడు ఎంతో కోపంగా.

ఉగ్రాక్షుడు ఆ కుర్రవాణ్ణి పరీక్షగా చూసి, వీడు తప్పక రాజకుమారుడే అని దృఢపరుచుకుని, "నన్నింత ఆయాసపెట్టి, మీరింత ఆయాసపడేకన్న—మొదటిసారిగానే యువరాజును నాకిస్తే సరిపోయేది గదా?" అన్నాడు.

"నువ్వు రాక్షసుడివి గనక కన్నకడుపు తీపి ఎలా వుంటుందో నీకు తెలియదు. రాణి మూర్ఛపోయింది. మహారాజు దుఃఖంతో తన గదిలో పడుకుని వున్నాడు. ఆయన ముందూ వెనకలు ఆలోచించకుండా నీకు చేసిన వాగ్దానం, ఈనాడు ఎంత విచార కారణం అయిందో నీకు తెలియదు. సరే, నువ్వు వచ్చినపని అయిందిగదా?" అన్నాడు అమరపాలుడు.

"అవునవును," అంటూ ఉగ్రాక్షుడు టిక్కమొహం వేసి, రాజకుమారణ్ణి భుజం మీదికి ఎత్తుకుంటూ, "ఏదో ఒకనాడు వచ్చి



మహారాజుగారి దర్శనం చేసుకుంటాను," అంటూ అడవికేసి బయలుదేరాడు.

"రాజకుమారుడికి ఏ కష్టం కలగకుండా చూస్తూ, పెంచి పెద్దవాణ్ణి చేసే భారం నీది, జాగ్రత్త!" అంటూ అమరపాలుడు వెనక నుంచి కేకవేశాడు.

ఉగ్రాక్షుడు ఆ కేక వింటూనే నడుస్తున్నవాడల్లా ఆగి, వెనుదిరిగి, "ఈనాటినుంచి వీడు చిత్రసేనమహారాజు కుమారుడుకాదు, నా కుమారుడు—ఉగ్రదత్తుడు! తెలిసిందా?" అంటూ హుంకరించాడు.

ఉప్పొంగుతున్న ఉత్సాహంతో ఉగ్రాక్షుడు అరణ్యానికి అడ్డంపడి తన కోటకేసి



నడుస్తూ, భుజంమీద వున్న రాకుమారుడితో, "బాబూ, ఇవాళటినుంచి నువ్వు నా కుమారుడివి. నీ పేరు ఉగ్రదత్తుడు. ఈ అడవి అంతా నీదే. నీకు సేవ చెయ్యటానికీ, నీ ఆజ్ఞల్ని పాలించేందుకూ వందలకొలది బంట్లు మన కోటలో వున్నారు," అన్నాడు.

ఉగ్రాక్షుడు తన కోటను సమీపించాడు. కోటముందు తమతమ కుటుంబాలతో రాక్షస బంట్లు సోలుపులుగా నిలబడివున్నారు. వాళ్ళు ఉగ్రాక్షుణ్ణీ, రాకుమారుణ్ణీ చూస్తూనే జయజయధ్వానాలు చేశారు.

ఉగ్రాక్షుడు తన సేవకులకు రాకుమారుణ్ణి చూపుతూ, "వీడు మీ కాబోయే నాయ



కుడు. పేరు ఉగ్రదత్తుడు!" అన్నాడు. వెంటనే 'ఉగ్రదత్తుడికీ జై' అన్న కేకలు వినిపించినై. ఉగ్రాక్షుడు కోటలో ప్రవేశించి, అక్కడ చక్కగా అలంకరించిన ఒక గదిలో ఉగ్రదత్తుణ్ణి భుజంమీదినుంచి దింపుతూ, "ఉగ్రదత్తా, ఈ గది నీది. నీతో కలిసి ఆడుకునేందుకు నీ వయసువాళ్ళే అయిన యిద్దరు బాలుర్ని తెప్పిస్తాను," అన్నాడు.

ఉగ్రాక్షుడు తన బంట్లలో ముఖ్యులైనవారిని నలుగురిని పిలిచి, "మీరు యిప్పుడే బయలుదేరి వెళ్ళి, ఉగ్రదత్తుడి వయసువాళ్ళయిన యిద్దరు మగపిల్లల్ని పట్టుకురండి. ఇది కొంత రహస్యంగా జరగాలి. మనం పల్లెలమీద పడి పిల్లల్ని అపహరిస్తున్నట్టు చిత్రసేన మహారాజుకు తెలియకూడదు," అన్నాడు.

"అయితే, ఈ పని రాత్రివేళ జరగటమే మంచిది," అన్నాడొక బంటు.

"అలాగే చెయ్యండి. కాని, చీకట్లో తెలియక ఏ గుడ్డివాళ్ళనో, కుంటివాళ్ళనో పట్టుకుని వస్తేమాత్రం మీ చర్మాలు వలుస్తాను. ఇదుగో, మీరు పిల్లల్ని దొంగిలించిన ఇంట్లో ఈ బంగారు కాసుల సంచులు వదిలిరండి," అంటూ ఉగ్రాక్షుడు తన బంట్లకు బంగారంవున్న రెండు సంచులు ఇచ్చాడు.



కొద్దిరోజులు గడిచినై. ఒకనాటి ఉదయం ఉగ్రాక్షుడు ఉగ్రదత్తుణ్ణి కోటముందున్న ఆవరణలో ఆడిస్తూవుండగా నలుగురు రాక్షసబంట్లు పాటలు పాడుతూ, ఈలలు వేస్తూ అక్కడికి పరిగెత్తుకు వచ్చారు. వాళ్ళ చేతుల్లో ఉగ్రదత్తుడి వయసువాళ్ళే అయిన యిద్దరు కుర్రవాళ్ళున్నారు.

వాళ్ళను చూస్తూనే ఉగ్రదత్తుడు వుత్సాహంగా గంతులు వేయసాగాడు. కాని, ఆ కుర్రవాళ్ళిద్దరూ భయంతో బిక్కుబిక్కుమంటున్నారు. ఉగ్రాక్షుడు తన బంట్లతో, "ఎవరికీ తెలియకుండా రహస్యంగానే ఈ ఇద్దర్నీ పట్టుకొచ్చారా?" అని అడిగాడు..

"పరాయి కంటికి తెలీదు, మహానాయకా. ఇద్దర్నీ ఊరిబయట చెరువుగట్టునున్న ఇళ్లల్లోనుంచి పట్టుకొచ్చాం. ఆ సమయంలో పెద్దవాళ్ళెవరూ అక్కడ లేరు. మీరిచ్చిన బంగారు కాసుల సంచులు ఇళ్ళల్లో వదిలాం," అన్నారు రాక్షసబంట్లు.

ఇంతలో కొత్తగా పట్టుకొచ్చిన కుర్రవాళ్ళిద్దరూ ఒక్కసారిగా గొంతులెత్తి ఏడవసాగారు. వాళ్ళను చూసి ఉగ్రదత్తుడుకూడా కెవ్వుమని ఏడుపు ప్రారంభించాడు. ఉగ్రాక్షుడు ముగ్గుర్నీ సముదాయించేందుకు ప్రయత్నిస్తూ తన బంట్లతో, "వీళ్ళను తోటలోకి తీసుకుపోయి ఆడించండి. అక్కడ వున్న పులిపిల్లల్నీ, ఎలుగు కూనల్నీ చూస్తే ఏడుపు మానొచ్చు. వీళ్లు ముగ్గురూ పెరిగి పెద్దవాళ్లయ్యేవరకూ, వీళ్ళను గురించిన సమాచారం అడవిలో వున్న గ్రామవాసులెవరికీ తెలియకూడదు," అన్నాడు.

వెంటనే రాక్షసబంట్లు కోట వెనక వున్న తోటలోకి ముగ్గురు బాలుర్నీ తీసుకుపోయారు. అక్కడ పులి, ఎలుగుబంటి మొదలైన క్రూరమృగాల పిల్లలు చెట్లకింద ఆడుకుంటున్నవి. వాటిని చూస్తూనే ఉగ్రదత్తుడూ, తతిమ్మా యిద్దరు కుర్రవాళ్ళూ ఏడుపుమానారు. —(ఇంకా వుంది)





# విశ్వాసపాత్రుడు

విసుగుచెందని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, విశ్వాసపాత్రులూ, ప్రభుభక్తి పరాయణులూ అయిన భృత్యులు తమను పోషించే రాజులకోసం ఎండనక, వాననక, అన్నికష్టాలూ పడుతూ, వీరవరుడిలాగా తమ ప్రభువు క్షేమంకోసం తమ కుటుంబాలను సయితం బలిపెట్టటం కద్దు. కాని నీబోటి మహారాజు ఒక యాచకుడి కోసం ఇలా శ్రమించటం ఎన్నడూ కనలేదు, వినలేదు. నీకు శ్రమ తెలియకుండా ఉండగలందులకు ఆ వీరవరుడి కథ చెబుతాను విను," అంటూ ఈవిధంగా చెప్పసాగాడు:

పూర్వం శోభావతి అనే నగరాన్ని శూద్రకుడనే మహారాజు ఏలుతూ ఉండేవాడు. ఆయన శూరప్రియుడు, ధర్మప్రియుడు. ఆయనది సాక్షాత్తూ రామరాజ్యమే.

---

## బేతాళ కథలు

---




ఇలా ఉండగా మాళవదేశం నుంచి వీరవరుడనే బ్రాహ్మడొకడు శూద్రకమహారాజు వద్దకు వచ్చి కొలువు కోరాడు. ఆ బ్రాహ్మడి చేతులలో కత్తీ, డాలూ, మొలను ఒక బాకూ చూసి అతను మహాశూరుడై ఉంటాడని ఊహించి రాజు, "ఏమి జీతం కోరుతావు?" అని అడిగాడు.

"రోజుకు అయిదువందల దీనారాలిప్పించండి," అని వీరవరుడు కోరాడు. అది చాలా ఎక్కువ జీతమే అయినా రాజు సరేనని వీరవరుణ్ణి కొలువులో పెట్టుకున్నాడు.

అయితే రాజుకు ఒక సందేహం కలిగింది: ఈ బ్రాహ్మడు రోజూ అయిదువందల దీనారాల బంగారం తీసుకుపోయి ఏంచేస్తాడు? ఈ సంగతి తెలుసుకోమని రాజు తన వేగులవాళ్ళను నియమించాడు. వాళ్ళు తిరిగివచ్చి రాజుతో వీరవరుడి దినచర్య వివరాలు చెప్పారు. రోజూ అతను ఉదయమే రాజభవనానికి వచ్చి, కత్తి చేతబట్టి, మధ్యాన్నందాకా హజారంలో నిలబడతాడు. మధ్యాన్నం తన జీతం పుచ్చుకుని ఇంటికి పోతాడు. ఇంటి ఖర్చుకుగాను భార్యకు నూరు దీనారాలిస్తాడు. మరో నూరు దీనారాలు బట్టలకూ, అలంకరణలకూ ఖర్చుపెడతాడు. మరి నూరు దీనారాలు దేవపూజకు వినియోగిస్తాడు. మిగిలిన రెండు వందల దీనారాలూ బ్రాహ్మణులకూ, దరిద్రులకూ దానం చేస్తాడు. వీరవరుడికి వ్యసనాలేమీ లేవు. ఆయన కుటుంబంలో ఆయన భార్యా, కుమారుడూ, కుమార్తె తప్ప మరెవరూ లేరు.

ఈ విషయాలన్నీ తెలుసుకుని రాజు తృప్తిపడి తాను వీరవరుడికిచ్చే పెద్ద జీతం సరిగానే వినియోగం అవుతున్నదని సంతోషించాడు.

పోతే ఈ వీరవరుడు తనకు కొలువు ఏవిధంగా చేస్తున్నాడో తెలుసుకోవాలని ఆయనకు కుతూహలం కలిగింది.

రాత్రి అంతా వీరవరుడు సింహద్వారంలో కత్తిదూసి నిలబడి ఉండేవాడు. రాత్రి ఏవేళ లేచి, "ఎవరు సింహద్వారంలో?" అని కేకపెట్టినా, "నేను, మహారాజా, వీరవరుణ్ణి!" అని సమాధానం వినిపించేది.

వేసవి అయేది, వర్షాకాలమయేది, పిడుగులు పడేది, వీరవరుడు సింహద్వారంలో ప్రతిమలాగే నిలబడి ఉండేవాడు.

"ఈ వీరవరుడు నిజంగా చాలా గట్టివాడు. నా సేవలో ఏమాత్రమూ ఏమరుపాటు రానివ్వడు!" అని రాజు సంతోషించాడు.

ఒకరాత్రి ఎడతెరిపి లేకుండా జడివాన కురుస్తున్నది. నక్షత్రాలు లేని కారణంచేత అంతటా కటిక చీకటి అలుముకున్నది. మేడమీద ఉన్న రాజుకు దూరాన ఎవరో స్త్రీ ఏడుస్తున్న ధ్వని వినవచ్చింది. తన రాజ్యంలో బాధితులూ, దుఃఖితులూ ఉండటం రాజు భరించలేడు. అందుచేత ఆయన, "ఎవరు సింహద్వారంలో?" అని కేకపెట్టాడు.

"నేను, మహారాజా, వీరవరుణ్ణి!" అని జవాబు వచ్చింది.

"చూడు, వీరవరా! ఎక్కడో స్త్రీ ఏడుస్తున్నది. వెళ్లి ఆమెకు కలిగిన కష్టమేమిటో తెలుసుకుని రా!" అన్నాడు రాజు.




"చిత్తం!" అంటూ వీరవరుడు స్త్రీ రోదనం వినిపించే దిక్కుగా బయలుదేరాడు. అతను ఏంచేస్తాడో కనిపెడదామని అతనికి కొంచెం వెనకగా రాజుకూడా బయలుదేరాడు.

వీరవరుడికి ఈ సంగతి తెలియదు. అతను చీకటిలో పడి పోగాపోగా ఊరిబయట ఒక సరస్సు వచ్చింది. ఆ సరస్సు నడుమ ఒక స్త్రీ నిలబడి పెద్దపెట్టున ఏడుస్తున్నది. వీరవరుడు ఆ స్త్రీతో, "నీవు ఎవతెవు? ఎందుకు ఏడుస్తున్నావు?" అన్నాడు.

"అయ్యా, నేను భూదేవిని. మరి మూడు రోజులకు ఈ దేశాన్ని ఏలే రాజోత్తముడు, శూద్రకమహారాజు చనిపోతాడు. ఆ తరవాత



మళ్ళీ అలాటి భర్త నాకు దొరకడు. అందు కని ఏడుస్తున్నాను," అన్నది ఆ స్త్రీ.

తనను పోషించే మహారాజు పోతాడనే సరికి వీరవరుడి గుండె గతుక్కుమన్నది. అతను ఆదుర్దాగా, "రాజుకు చావు తప్పే ఉపాయం ఏమైనా ఉందా? ఉంటే చెప్పు, తల్లీ!" అన్నాడు.

"ఉన్నది, కాని దానిని నీవు చేస్తావా అని నా సందేహం," అన్నది స్త్రీ.

"అమ్మా, ఆ మహారాజు ఉప్పు తింటు న్నాను. ఆయనకోసం ప్రాణం ఇవ్వమన్నా ఇస్తాను. సందేహించక చెప్పు!" అన్నాడు వీరవరుడు.



"రాజభవనం సమీపంలో ఉన్న చండి కాలయంలోని దేవికి నీ కొడుకును బలి ఇచ్చినట్టయితే రాజు నూరేళ్ళు బతుకు తాడు!" అన్నది ఆ స్త్రీ.

"ఇప్పుడే ఆ పని చేస్తాను!" అంటూ వీరవరుడు కదిలాడు.

సరస్సులో నిలబడి ఉండిన స్త్రీ అలాగే అంతర్ధానమయింది.

ఇదంతా చూస్తూ ఉండిన రాజుకు అత్యాశ్చర్యమయింది. ఏం జరుగుతుందో చూదామని ఆయన చీకటిలో వీరవరుడి వెంట మళ్ళీ కదిలాడు.

వీరవరుడు సరాసరి తన ఇంటికివెళ్లాడు. భార్యతో జరిగిన సంగతంతా చెప్పాడు. ఆమె భర్తతో, "మన రాజుగారికి మనం ఈ ఉపకారం తప్పక చేయవలిసిందే. అబ్బాయిని లేపి వాడితోకూడా ఈ సంగతి చెప్పండి," అన్నది.

వీరవరుడు తన కొడుకును నిద్ర లేపి, "నాయనా, నిన్ను చండికాలయంలో బలి ఇస్తే రాజుగారి ప్రాణాలు దక్కుతాయి. లేకపోతే ఇవాళకు మూడోరోజున ఆయన చనిపోతాడు," అని చెప్పాడు.

"అయితే చండికాలయానికి పోదాం పద, నాన్నా. మనం రాజుగారి రుణం తీర్చు



కునేటందుకు ఇది మంచి అవకాశం," అన్నాడు కొడుకు.

వీరవరుడు భార్యను వెంటబెట్టుకుని, తన కొడుకునూ, కూతురినీ రెండు భుజాల మీదా ఎక్కించుకుని చండికాలయానికి బయలుదేరాడు.

రాజుకూడా ఆ చీకటిలో రహస్యంగా వారిని వెంబడించాడు.

ఆలయంలోపల వీరవరుడు చండికకు నమస్కరించి, "తల్లీ, నా కొడుకును బలి పుచ్చుకుని శూద్రకమహారాజుగారికి సంపూర్ణాయువు అనుగ్రహించు," అంటూ పిల్లవాడి తల తెగవేశాడు.

వీరవరుడి కూతురు పసిపిల్ల. ఆమె తన అన్న తలను తన చేతుల్లోకి తీసుకుని, వెక్కి వెక్కి ఏడుస్తూ, ప్రాణం కడబట్టి చనిపోయింది.

వీరవరుడితో ఆయన భార్య, "ఏమండీ, చితి పేర్చండి. అందులో నా పిల్లలతోబాటు నేనుకూడా కాలి బూడిద అవుతాను. రాజుగారి పని తీరిందిగద. ఇద్దరు పిల్లలనూ పోగొట్టుకుని నేను బతికి ఉండలేను," అన్నది. వీరవరుడు సరేనని ఒక చితి పేర్చి, గుడిలోని దీపపు ప్రమిద సహాయంతో దాన్ని అంటించాడు. అతని భార్య తన ఇద్దరు పిల్లలనూ తీసుకుని దానిపైన కాలిపోయింది.





అప్పుడు వీరవరుడు చండిక ముందుకు వెళ్లి స్తోత్రం చదివి, "ఇంతకాలమూ వీ భార్య కోసమూ, పిల్లలకోసమూ జీవించానో వారిప్పుడు లేరు. రాజుగారి ఉప్పు తిన్నందుకు ఆయనకు చేయదగిన మేలు చేశాను. ఇక నాకు జీవితంపై కోరిక లేదు. నన్ను కూడా బలితీసుకో!" అంటూ తన కత్తితో తన తలను తెగవేసుకున్నాడు.

ఇదంతా చూస్తున్న రాజుకు పట్టరాని ఆశ్చర్యం కలిగింది. రాజులకోసం త్యాగం చేసే భృత్యులు తమ త్యాగాలను ప్రపంచాని కంతకూ తెలిసేలాగ చేస్తారు. కాని ఈ వీరవరుడు తనకోసం మూడో కంటి వాడికి తెలియకుండా సకుటుంబంగా బలి అయిపోయాడు.

రాజు చండికను సమీపించి, "దేవీ, నీవు శక్తిమంతురాలివైతే నన్ను బలిపుచ్చుకుని, నాకోసం బలి అయిన వీరవరుడి కుటుంబాన్ని తిరిగి బతికించు. నా ఒక్కడి కోసం ఇంతమంది ప్రాణాలు అర్పించటం అన్యాయం," అంటూ కత్తి ఎత్తి తల తెగ వేసుకోబోయాడు.

అంతలో ఆకాశం నుంచి, "నాయనా, ఆగు. వీరవరుడి కుటుంబాన్ని నేను బతికిస్తాను," అన్న మాటలు వినిపించాయి. అప్పుడే వీరవరుడూ, ఆయన భార్యా, కొడుకూ, కూతురూ తిరిగి బతికారు.

రాజు చాటుకు వెళ్ళి, అటునుంచి తన ఇంటికి వెళ్ళాడు.

వీరవరుడికి మాత్రం అంతా కలలాగా ఉన్నది. ఆయన తన భార్యనూ, బిడ్డలనూ చూసి, "ఏమిటిది? మీరంతా చితిపైన కాలి బూడిద అయిపోలేదా? ఇంతకుముందు దేవి ఎదట తల నరికేసుకున్న నేను కూడా బతికే ఉన్నాను. ఇదంతా తప్పక దేవి అనుగ్రహమే," అనుకున్నాడు.

తరవాత వీరవరుడు తనవాళ్లను ఇంటికి చేర్చి, తాను మళ్లీ రాజభవనానికి వెళ్ళాడు.

అతని రాక పైనుంచి గమనిస్తున్న రాజు ఏమీ ఎరగనట్టుగా, "ఎవరు సింహ ద్వారంలో?" అని కేకపెట్టాడు.

"నేనే, మహారాజా, వీరవరుణ్ణి. తమ ఆజ్ఞప్రకారం ఆ ఏడిచే మనిషిని వెతుక్కుంటూ వెళ్ళాను. ఎవరో రాక్షసిలాగుంది. కనపడీ కనపడకుండానే మాయమయింది," అన్నాడు.

అంతేకాని అతను రాజుకు దీర్ఘాయువు కలగగలందులకు తన కొడుకును చండికకు బలిచేసిన సంగతి రాజుకు చెప్పనేలేదు. చచ్చిపోయిన వీరవరుడి కుటుంబాన్ని తాను బతికించిన విషయం రాజుకూడా రహస్యంగానే ఉంచాడు.

ఇది జరిగినాక రాజు వీరవరుడికి లాట రాజ్యమూ, కర్ణాటక రాజ్యమూ ఇచ్చి తనతో సమానమైన హోదా గలవాణ్ణిగా చేశాడు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, వీరందరిలోనూ ఎవరు గొప్ప? వీరవరుడా, అతని భార్యా, అతని కొడుకా, శూద్రకమహారాజా? నీకు సమాధానం తెలిసికూడా చెప్పక పోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "శూద్రకమహారాజే గొప్పవాడు. వీరవరుడు తన కొడుకును బలి ఇవ్వటంలో గొప్ప త్యాగమే చేసినప్పటికీ అతను తన ధర్మాన్నిమాత్రమే నెరవేర్చాడు. అతని భార్య భర్త అడుగు జాడలలో నడిచింది. అదికూడా ఆమెకు సహజ ధర్మమే. అలాగే వీరవరుడి కొడుకు రాజుగారికోసం తన ప్రాణాలు అర్పించటంకూడా సహజ ధర్మమే. కాని రాజు తన సేవకుల కోసం తన ప్రాణాలను అర్పించటం కేవలం ధర్మాన్నిబట్టి జరిగినదికాదు. అందుచేత మిగిలిన వాళ్ళకంటె రాజు గొప్పవాడు," అని చెప్పాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతోసహా మాయమై తిరిగి చెట్టెక్కాడు.






# తిమ్మరుసు తెలివి

విజయనగర సామ్రాజ్యానికి గొప్ప కీర్తిని తెచ్చిన శ్రీకృష్ణదేవరాయలు పేరు అందరికీ తెలిసినదే! ఆయన తండ్రి సాళ్వ నరసింహ రాయలు రాజ్యంచేసే కాలంలో, ఆయన ప్రధానమంత్రి అకస్మాత్తుగా చనిపోయాడు. బుద్ధిశాలి అయినవాడు లభించినట్టయితే మంత్రిగా వేసుకుంటానని నరసింహ రాయలు చాటింపు వేయించాడు.

ఎందరెందరో మంత్రి పదవి అలంకరించటానికి వచ్చారు. కాని వారి తెలివితేటలతో నరసింహరాయలు కొంచెంకూడా తృప్తి చెందలేదు. వచ్చినవారిలో ఏ ఒకడూ ఆయనకు నచ్చలేదు.

చివరకు నరసింహరాయలు ఒక ఉపాయం చేశాడు. ఆయన ఒక కాగితంపై సిరాతో నాలుగు అంగుళాల నిడివి గల ఒక గీత గీసి, దానిని తన చారుల కిచ్చి, "ఈ గీతను చెరపకుండా చిన్నది చేయగలవాడు ఎక్కడనైనా ఉంటే నా దగ్గిరికి తీసుకు రండి," అని చెప్పాడు.

చారులు ఆ కాగితం పట్టుకుని ఊళ్లూళ్లు తిరిగారు. కాస్త తెలివిగా కనపడినవాడికల్లా ఆ కాగితం చూపి, "అయ్యా, మీరీ గీతను చెరపకుండా చిన్నది చెయ్యగలరా?" అని అడిగారు.

కొందరు, "అది ఎలా సాధ్యమవుతుంది?" అన్నారు. మరికొందరు, "మీకేమైనా మతిపోయిందా ఏమిటి? ఉన్న గీతను చెరపకుండా ఎలా పొట్టి చెయ్యటం?" అన్నారు. కొందరు కోపం తెచ్చుకుని, "మీకు నన్ను చూస్తే వేళాకోళంగా ఉందా ఏమిటి?" అని కూడా అడిగారు.

చారులు ఒక్కొక్క గ్రామమే తిరుగుతూ ఒక అగ్రహారం చేరి, అక్కడివాళ్లను కూడా ఇలాగే అడుగుతూ వచ్చారు. ఆ అగ్రహారంలో వారి కొక బడి కనిపించింది.

టి. రాజగోపాలరావు



ఉపాధ్యాయుడు పిల్లలను కొందరిని పెట్టు కుని చదువు చెబుతున్నాడు.

చారులు ఉపాధ్యాయుడి దగ్గిరికి వెళ్ళి, "అయ్యా, ఈ కాగితంమీద ఉన్న గీత చూశారుగదా. దీనిని చెరపకుండా చిన్నది చెయ్యగలరా?" అని అడిగారు.

ఉపాధ్యాయుడు వాళ్ల మాటలను విని, "ఆ పని నేను కాదుగదా మరెవరూ చెయ్య లేరు. ఎవరైనా గారడీవాళ్లను అడిగి చూడండి," అన్నాడు. చారులు వెనక్కు తిరిగి వెళ్లిపోసాగారు.

ఆ బడిలో పదహారేళ్ల బ్రాహ్మణ కుర్రవా డొకడు చదువుకుంటున్నాడు. అతడి పేరు తిమ్మరుసు. అతను ఉపాధ్యాయుడితో, "అయ్యా, వాళ్లు కోరినది బ్రహ్మవిద్య కాదే. ఆ గీటు పక్కన అంతకంటె పెద్ద గీటు గీస్తే ఆ గీటు చిన్నదైపోదా?" అన్నాడు.

ఉపాధ్యాయుడికి ఈ యుక్తి అర్ధ మయింది. వెళ్లిపోతున్న చారులను వెనక్కు పిలిచి, "ఏదీ, ఆ కాగితం ఇలా ఇవ్వండి," అన్నాడాయన. తరవాత నాలుగు అంగుళాల గీత పక్కన అంతకంటె పెద్దగీత గీసి, "మీరు తెచ్చిన గీత చిన్నదైపోయింది. ఇక వెళ్ళండి!" అన్నాడు.

వెంటనే చారులు పరమానందంతో ఆ ఉపాధ్యాయుడికి నమస్కరించి, "అయ్యా, మేము సాళ్వ నరసింహరాయలు పంపిన దూతలం. ఈ కాగితాన్ని మాకిస్తూ మహా రాజుగారు ఈ గీతను చిన్నది చేసినవారిని తమవద్దకు తీసుకురమ్మన్నారు. ఎంతో మంది ఈ కాగితాన్ని చూసి కూడా గీతను చిన్నది చెయ్యలేకపోయారు. మీరుకూడా చేయలేకపోయారనే అనుకున్నాం. కాని చివ రకు మీ మూలానే యిన్నాళ్ళుగా మేము పడ్డ శ్రమ ఫలించింది. మీకోసం యిప్పుడే పల్లకీ తీసుకువస్తాం. రాజధానికి బయలు దేరటానికి సిద్ధంగా ఉండండి," అని శలవు తీసుకున్నారు.

ఉపాధ్యాయుడి మనస్సులో ఆనందం పొంగి వచ్చింది. ఆయన తిమ్మరుసుతో, "ఒరే, బాబూ! రాజుగారు ఏదో కానుక ఇస్తారులాగుంది. నిజానికి ఆ కానుక నీకు రావలిసినదే అయినా ఈసారికి నన్ను తీసు కోనీ. ఇదే నాకు నువ్విచ్చే గురుదక్షిణ అనుకో. నీవా చిన్నవాడవు, తెలివిగలవాడవు, ముందు ముందు ఎంతలేసి బహుమానాలైనా పొందు తావు. ఈ రహస్యం ఎక్కడా చెప్పకు!" అని బతిమాలుతూ అన్నాడు.

తిమ్మరుసు నవ్వి, "గురువుగారూ, ఇంతగా నాతో ఎందుకు చెబుతున్నారు? ఆ గీతను చిన్నది చేసింది మీరేగాని నేను కాదే!" అన్నాడు.

ఉపాధ్యాయుడికి తృప్తిఅయింది. ఆయన వెంటనే గ్రామంలోకి వెళ్లి, అందరికీ తనకు రాజుగారివల్ల జరగబోయే సన్మానం గురించి చెప్పి, చారులు తెచ్చిన పల్లకీ ఎక్కి రాజధానికి వెళ్లాడు.

ఆ పల్లకీలో వచ్చిన ఉపాధ్యాయుడు కాగితంమీది గీతను ఎలా చిన్నది చేసినదీ చారులు చెప్పగా విని నరసింహరాయలు చాలా సంతోషించాడు. కాని చూడటానికే మూఢుడులాగున్న ఆ ఉపాధ్యాయుడు బుద్ధిశాలి అని ఆయనకు నమ్మకం కుదర



లేదు. అందుచేత ఆయన ఉపాధ్యాయుడికి మరొక పరీక్ష ఏర్పాటు చేశాడు.

దర్బారులో ఒకచోట ఒక పీటమీద కొన్ని ముద్రికలు ఉంచారు. ఆ పీటచుట్టూ పరుపులు పరిచారు.

తరవాత రాజు ఉపాధ్యాయుణ్ణి దర్బారుకు పిలిపించాడు.

"అయ్యా, ఆ కాగితంమీది గీతను చిన్నది చెయ్యమని పరీక్ష పెట్టినది ఎందుకో మీకింకా తెలియదు. నాకు మంత్రి కావలిసి ఆ పరీక్షలో నెగ్గినవాడికి మంత్రిపదవి ఇవ్వ నిశ్చయించాను. మీరు ఆ పరీక్షలో నెగ్గారు. కనుక మీకు మంత్రిపదవి ఇస్తున్నాను.

మీ పదవికి సంబంధించిన ముద్రికలు ఆ పీటమీద ఉన్నాయి. తెచ్చుకోండి. ఆ పరుపులు మాత్రం తొక్కకండి!" అన్నాడు.

ఏదో బహుమానం దొరుకుతుంది, దాన్ని పుచ్చుకుని అగ్రహారానికి తిరిగి పోదాం అనుకుంటున్న ఉపాధ్యాయుడికి మంత్రి పదవి అనగానే కాళ్లు వణికాయి, ముచ్చెమటలు పోశాయి. పైగా, పరుపులు తొక్కకుండా పీటవద్దకు వెళ్ళి ముద్రికలు తీసుకోవటం ఎలాగో ఆయనకు బోధపడలేదు. అంత పెద్ద సభలోనూ తనకు గొప్ప పరాభవం జరగబోతున్నదని తెలిసి ఆయన కొయ్యబారి అలాగే నిలబడిపోయాడు.

నరసింహరాయలు అనుమానం దృఢపడింది. ఆయన ఉపాధ్యాయుడితో, "అలా నిలబడిపోయా వేమయ్యా? నీకా ముద్రికలు తీసుకోవటం చాతకాదా? ఇంతకూ నేను గీసిన గీటును చిన్నది చేసినది నీవా, మరొకరా?" అన్నాడు.

ఉపాధ్యాయుడు వెంటనే రాజు కాళ్లపైన పడి, "మహాప్రభో, క్షమించాలి. దురాశచేత అపచారం చేశాను. ఆ గీటును చిన్నది చెయ్యుట మెలాగో నాకు యుక్తి చెప్పినవాడు నా విద్యార్థి తిమ్మరుసు—నేను కాను!" అని నిజం ఒప్పుకున్నాడు.

అప్పటికప్పుడే నరసింహరాయలు అగ్రహారానికి మరొక పల్లకీ పంపి తిమ్మరుసును రప్పించాడు. రాజు అతనితో, "నేను గీసిన గీటును చిన్నది చేసే యుక్తి చెప్పినవాడవు నీవేనటగదా? నీకు మంత్రిపదవి ఇస్తున్నాము. అవిగో నీ అధికార ముద్రికలు. పరుపులు తొక్కకుండా వెళ్లి వాటిని తెచ్చుకో!" అన్నాడు.

తిమ్మరుసు పరుపులు చుట్టుకుంటూ పీటవద్దకు వెళ్లి, దానిమీదవున్న అధికార ముద్రికలు తెచ్చుకున్నాడు. నరసింహరాయలు అతని యుక్తికి మెచ్చుకుని అతనిని మంత్రిగా వేసుకున్నాడు.





# నగారా తీర్పు

ఒకసారి ఇద్దరు ముసలి కాపులు తమ గ్రామం నుంచి కొంత తేనె పట్టుకుపోయి, దాన్ని నగరంలో అమ్మి, ఆ రాత్రికి ఒక సత్రంలో బస చేశారు. పడుకోబోయేముందు వాళ్ళకొక సందేహం కలిగింది: తమవద్ద ఉండే వెండి రూకలు రాత్రివేళ ఎవరైనా కాజేస్తారేమో!

"అవును. సత్రాలను నమ్మటానికి వీల్లేదు. అందుకని మనం ఒక యుక్తి చేద్దాం. మన వెండిని తేనె దుత్తలు తెచ్చిన గంపలో ఉంచుదాం. ఒకవేళ మన గదిలోకి దొంగాడు జొరబడినా, డబ్బు ఆ గంపలో ఉంటుందని చచ్చినా ఊహించలేడు!" అన్నాడు ఒక ముసలాడు.

ఈ ఉపాయం చాలా బాగుందన్నాడు రెండో ముసలాడు. ఇద్దరూ ఒక కొవ్వొత్తి వెలిగించి, తేనె అమ్మగా వచ్చిన తమ వెండిని భద్రంగా గంప అడుగున పెట్టి, తరవాత దీపం ఆర్పి, నిశ్చింతగా పడుకుని నిద్రపోయారు.

కాని గోడలకు చెవులుంటాయి, తలుపు సందులకు కళ్ళుంటాయి. ఈ ముసలాళ్ళిద్దరూ పడుకోబోయేముందు తమ వెండిని గంపలో ఉంచటం సత్రం యజమానీ, అతడి భార్యా కూడా తలుపు కంతల్లోనుంచి చూశారు. ముసలాళ్ళిద్దరూ గుర్రుపెట్టి నిద్రపోయే సమయంలో వాళ్ళు చడీచప్పుడూ లేకుండా గదిలో ప్రవేశించి గంపలో ఉన్న వెండి అంతా కాజేశారు.

తెల్లవారి ముసలి కాపులు లేచి గంపలో చూసుకుంటే ఏముందీ? వెండి కాస్తా పోనే పోయింది. ఇద్దరూ కాస్సేపు తలలు బాదుకున్నారు. ఇంతలో వాళ్ళకు నిజం స్ఫురించింది. సత్రం బయటి తలుపులింకా తెరవలేదు: సత్రంలో ఆ రాత్రి తాము తప్ప పైవాళ్ళెవరూ లేరు; అలాటప్పుడు ఈ వెండిని

చీనా జానపద కథ



కాజేసినది సత్రం యజమాని కావాలి, లేదా అతడి భార్య కావాలి!

ముసలాళ్ళు వెంటనే సత్రం యజమాని వద్దకు వెళ్ళి, "నిన్నరాత్రి మా వెండి రూకలు ఎవరో కాజేశారు," అని చెప్పారు.

ఈ మాట వింటూనే సత్రం యజమానీ, అతడి భార్యా కూడా పెద్దగా హైరానపడి పోయినట్టుగా నటిస్తూ, "అయ్యో, ఎంత పని జరిగిందీ! ఎంత పనీ! ఈ వెధవరూకలు పోతే మీకొక లెక్కా జమా కాకపోవచ్చు, కాని సత్రానికి తీరని అపఖ్యాతే! ఇటువంటి మాట పుట్టిందీ అంటే అది ఎన్నటికీ మాసి పోదుగదా! అందుచేత దీని అంతేమిటో తేల్చుకోవలిసిందే. పదండి న్యాయాధికారి దగ్గిరికి పోదాం!" అన్నారు.

ఇంకేముందీ? నలుగురూ కలిసి న్యాయాధికారి దగ్గిరికి వెళ్ళారు.

న్యాయాధికారి ఉభయ పక్షాలవారి కథా విన్నాడు. కాని ఎంత ఆలోచించినా నిజం నిర్ణయించలేకపోయాడు.

ఆ నగరంలో ఫాన్ చియాంగ్ షాన్ అనే మేధావి ఉన్నాడు. న్యాయాధికారి వాణ్ణి పిలిపించి, "వీళ్లు నలుగురూ ఒక ఫిర్యాదు తెచ్చారు. వాళ్ళు చెప్పేది విని నిజం తెలుసుకో గలవేమో చూడు!" అన్నాడు.

ముందు ముసలికాపులు తమ వెండి పోయిన విధం చెప్పారు. తరవాత సత్రం యజమానీ, భార్యా కూడా, "వీళ్ల మాటలు నమ్మటానికి ఆధారం ఏమిటి? పైవాళ్లెవరూ రాలేదు. ఇక దొంగతనం చేస్తే మేమే చెయ్యాలి. ఈ ముసలాళ్ళు మాకు దొంగతనం అంటగట్టితే సత్రానికి ఎలాటి శాశ్వతమైన అపఖ్యాతో మీరే ఆలోచించండి. ఈ కారణంవల్ల, వాళ్లకు జరిగిందంటున్న నష్టంకంటె మాకు జరిగిన నష్టమే చాలా హెచ్చు!" అన్నారు.

ఉభయపక్షాల మాటలూ విన్నాక ఫాన్ చియాంగ్ షాన్, "ఈ ఫిర్యాదులో నిజం

నిర్ధారణ చెయ్యటం నాకు కూడా సాధ్యం కాదు. ఈ పని మన పెద్ద గుడిలో ఉండే నగారా వల్లనే కావాలి!" అన్నాడు.

న్యాయాధిపతి ఆశ్చర్యపోయి, "నేను ఇవ్వలేని తీర్పు నగారా ఇస్తుందా?" అని అడిగాడు.

"చిత్తం. అది గొప్ప మహత్తు గల నగారా. ఫిర్యాదు చేసినవాళ్లు దానిని న్యాయ స్థానానికి మోసుకురావాలి. వాళ్ళ ఫిర్యాదు న్యాయమైనదైతే నగారా తనంతట తానే మోగుతుంది. ఫిర్యాదు అక్రమమైన పక్షంలో మాత్రం నగారా మోగదు!" అన్నాడు ఫాన్ చియాంగ్ షాన్.

న్యాయాధికారికి ఇదంతా అయోమయం గానూ, నమ్మశక్యం కాకుండానూ ఉన్నది. అయినా ఈ మాటలన్నవాడు ఎంతో సూక్ష్మ బుద్ధి గలవాడు. అందుచేత న్యాయాధికారి, "సరే, ముందు డబ్బు పోగొట్టుకున్నవారు రేపు ఉదయం కొత్తబట్టలు కట్టుకుని, గుడికి వెళ్లి, అక్కడ ఉండే నగారాను ఇక్కడికి మోసుకురండి. ఏం జరుగుతుందో చూస్తాం!" అన్నాడు.

ఆ ప్రకారమే మర్నాడు ముసలివాళ్లు కొత్తబట్టలు కట్టుకుని గుడికి వెళ్లి, నగారాను ఒక వాసానికి తగిలించి, చెరొక చివరా పట్టు



కుని భుజాల కెత్తుకుని న్యాయస్థానానికి బయలుదేరారు. నగారా చచ్చే బరువున్నది. ముసలాళ్లిద్దరూ కొంతదూరం నడిచి అలిసి పోయి నగారాను కింద దింపారు.

వారిలో ఒకడు, "వెధవ డబ్బు పోవటం గాక ఎంత పీడ వచ్చి పడిందిరా, బాబూ! మనం చెప్పినది నిజమే అయినా ఈ నగారా దానంతట అదే మోగుతుందంటే, అది కలలో మాట. ఇది మోగా మోగదు, మన పోయిన డబ్బు తిరిగి మనకు రానూ రాదు!" అన్నాడు.

ముసలాడు మాట్లాడటం మానాడో లేదో నగారా దానంతట అదే మోగసాగింది.

ముసలికాపుల ప్రాణాలు లేచివచ్చాయి. వాళ్లు మళ్లీ నగారాను ఎత్తుకుని గుడికి తిరిగి వెళ్ళి దాన్ని యథాస్థానంలో ఉంచి, న్యాయస్థానానికి వెళ్లారు.

"ముసలాళ్ళ డబ్బు పోయినమాట నిజమేనన్నందుకు నగారా దానంతట అదే మోగిందికద. ఇక ఆ డబ్బు మీరు తీయ లేదని రుజువు చెయ్యటానికిగాను రేపు మీ భార్యాభర్తలు కొత్త బట్టలు కట్టుకుని నగారాను మోయండి," అని న్యాయాధిపతి సత్రం యజమానితో చెప్పాడు.

సత్రం యజమానీ, భార్యా మర్నాడు నగారా ఎత్తుకుని న్యాయస్థానానికి బయలు దేరారు. వాళ్ళకుకూడా అది బరువుగానే ఉన్నది. వాళ్ళుకూడా నగారాను మధ్య దారిలో దింపారు.

"ఆ డబ్బు కాజెయ్యటం ఎంత బుద్ధి పొరపాటయింది. దొంగతనం చెయ్యటానికి మనం తప్ప ఆ రాత్రి సత్రంలో మరొక పురుగు లేకపోయె!" అన్నది సత్రం యజమాని భార్య.

"ఏమయిందో అయింది. ఇంతదాకా వచ్చాక కాజేసిన డబ్బు ఎలా తిరిగి ఇస్తాం. ఈ దిక్కుమాలిన నగారా మనకోసం ఎలాగూ మోగదు. ఏం కానున్నదో!" అన్నాడు సత్రం యజమాని.

ఆ సమయంలో నగారా పైభాగం తెరుచుకున్నది. అందులోనుంచి ఫాన్ చియాంగ్ షాన్ పైకి వస్తూ, "ఈ సంగతి న్యాయస్థానంలోనే ఒప్పేసుకుంటే ఈ శ్రమంతా తప్పేదిగద!" అన్నాడు.

"బాబ్బాబు! ఆ ముసలాళ్ల సొత్తు వాళ్ల కిచ్చేస్తాం. మా పరువు కాపాడు!" అని సత్రం యజమానీ, భార్యా అతడి కాళ్ళ పైన పడ్డారు.

ముసలి కాపులు తమ సొత్తు దొరికేసరికి సంతోషించి, సత్రం యజమానిని క్షమించి, తమ గ్రామానికి తిరిగి వెళ్ళిపోయారు.





# శకుంతల

హస్తిన నగరానికి రాజైన దుష్యంతుడు ఒక నాడు అడవిలో వన్యమృగాలను వేటాడుతూ ఒక జింకను తరుముకుని తన రథంలో మునీశ్వరుల ఆశ్రమాలకేసి వచ్చాడు. ఆయన జింకను బాణంతో కొట్టబోతూ ఉండగా, "ఆగు, ఆగు! ఆశ్రమ మృగాన్ని కొట్టకు!" అంటూ వైఖానసుడు తన శిష్యులతో సహా ఎదురు వచ్చాడు. ఆయన దుష్యంతుణ్ణి, "చక్రవర్తి కాగల కొడుకును కంటావు," అని ఆశీర్వదించి, ఆ సమీపం లోనే మాలినీ నదీ తీరాన కణ్వమహాముని ఆశ్రమం ఉన్నదనీ, కణ్వుడు సోమతీర్థానికి వెళ్లాడనీ, అక్కడికి వెళ్లినట్టయితే కణ్వుడి కుమార్తె శకుంతల ఆతిథ్యం ఇస్తుందనీ తెలియపరిచాడు.

దుష్యంతుడు ఆశ్రమానికి అంత దూరం లోనే రథం దిగి, తన రాజలాంఛనాలనూ, ధనుర్బాణాలనూ రథంలోనే ఉంచి, "నేను తిరిగి వచ్చేలోపుగా గుర్రాలను కడుగు," అని సారథికి చెప్పి, ఆశ్రమం ప్రవేశించాడు.

ఆశ్రమంలో శకుంతలా, అనసూయా, ప్రియంవదా అనే మునికన్యలూ చెట్లకు నీళ్ళు పోస్తున్నారు. వారిలో వారు మాట్లాడుకునే సరసపు మాటలు వింటూ రాజు ఒక చెట్టుకింద కూచున్నాడు. ఇంతలో శకుంతల ముఖాన తుమ్మెదలు వచ్చి ముసురుకున్నాయి. ఆమె గొంతెత్తి, "తుమ్మెదలు! కాపాడండి!" అని అరిచింది.

"నిన్ను కాపాడటానికి మాకేం పట్టింది? అందరినీ కాపాడే భారం రాజైన దుష్యంతుడిది. ఆయనను పిలు!" అంటూ నవ్వారు చెలికత్తెలు.

వెంటనే రాజు, "పూరువంశపు రాజును, దుష్యంతుణ్ణి ఉండగా మీకెవరు అపకారం చెయ్యగలరు?" అంటూ వారిని సమీపించాడు. మునికన్యలు ఆయనను చూసి

కాళిదాసు నాటక కథ





మైన తపస్సు చేస్తూఉంటే ఆ తపస్సు భగ్నం చెయ్యటానికని దేవతలు మేనకను పంపారు. ఆమె వచ్చిన పని నెరవేరింది. విశ్వామిత్రుడికీ మేనకకూ శకుంతల పుట్టింది. ఆమెను కణ్వుడు పెంచి పెద్ద దానిని చేసి, తగిన వరుడు దొరికితే పెళ్లి చేయాలని ఉన్నాడు.

వారిలా మాట్లాడుకునేసమయంలో శకుంతలా దుష్యంతులు ఒకరినొకరు ప్రేమించుకోవటం జరిగింది. ఇంతలో ఆశ్రమం వెలపలనుంచి కేకలు వినిపించాయి— దుష్యంతుడి రథం చూసి అడవిఏనుగు ఒకటి బెదిరిందట. ఈ కేకలు వినగానే మునికన్యలు లేచి, రాజువద్ద సెలవు పుచ్చుకుని ఆశ్రమం లోపలికి వెళ్ళిపోయారు. దుష్యంతుడు ఆశ్రమం దాటి వచ్చేశాడు. అప్పటికి ఆయన పరివారంకూడా అక్కడికి చేరింది.

దుష్యంతుడు శకుంతల విషయమంతా తన విదూషకుడైన మాధవ్యుడితో చెప్పి, "నాకు ఆమెను చూడాలని ఉన్నది. ఏ మిష మీద మనం ఆశ్రమం ప్రవేశించగలం?" అని సలహా అడిగాడు. అదృష్టవశాత్తూ ఆశ్రమం నుంచి ఇద్దరు మునికుమారులు వచ్చి, "మహారాజా, ఆశ్రమవాసులు తమ

బిత్తరపోయారు. రాజు వారిని, "ఈ ఆశ్రమంలో తపస్సు నిర్విఘ్నంగా సాగుతున్నదా?" అని అడిగాడు. అతిథిని సత్కరించటం విధి గనక అనసూయ రాజును ఏడాకుల అరటి చెట్టుకింది తిన్నెపైన కూచుని విశ్రాంతి తీసుకోమని ఆహ్వానించింది.

"మీరుకూడా చెట్లకు నీరు పోసి అలసి ఉన్నారు. నాతోపాటు విశ్రాంతి తీసుకోండి," అన్నాడు రాజు. అందరూ కూర్చున్న తరవాత ఆయన అనసూయా ప్రియంవదలను అడిగి శకుంతల జనన వృత్తాంతం తెలుసుకున్నాడు. విశ్వామిత్రుడు ఘోర





రిని కొన్నిరోజులు ఆశ్రమంలో ఉండవలి సిందిగా ఆహ్వానించమన్నారు. కణ్వమహా ముని యిక్కడ లేని కారణంచేత రాక్షసులు తపస్సుకు భంగం కలిగిస్తున్నారు," అని చెప్పారు.

దుష్యంతుడికి రొట్టె విరిగి నేతిలో పడ్డట్టయింది. ఆయన తన రథాన్ని తెప్పించి దానిలో ఆశ్రమానికి వెళ్లాడు. దుష్యంతుడి బాణం ధ్వని వింటూనే రాక్షసులు పారిపోయారు. తనలాగే శకుంతలకూడా ప్రేమతో బాధపడుతున్నదని దుష్యంతుడికి తెలిసిపోయింది. ఆయన శకుంతలను రహస్యంగా పెళ్ళాడగోరాడు. కాని శకుంతల తన తండ్రితో చెప్పాలన్నది.

"నీవు క్షత్రియ కన్యవు. గాంధర్వ వివాహం నీకు తప్పులేదు," అని దుష్యంతుడామెకు బోధించాడు. ఇద్దరికీ రహస్యంగా గాంధర్వ వివాహం జరిగింది. యజ్ఞంకూడా పూర్తి అయింది. దుష్యంతుడు శకుంతలకు తన ఉంగరం ఇస్తూ, "ఈ ఉంగరంమీద ఎన్ని అక్షరాలున్నాయో అన్ని రోజులలో నిన్ను నా ఇంటికి తెప్పించుకుంటాను," అని మాట ఇచ్చాడు.

శకుంతల చెలికత్తెలు రాజుతో, "రాజా, నీకు అనేకమంది భార్యలున్నారు. మా



స్నేహితురాలిపట్ల ప్రేమగా ఉండాలి," అని చెప్పారు.

"ఎంతమంది భార్యలున్నా మీ స్నేహితురాలే నాకు పట్టపుదేవి," అని చెప్పి దుష్యంతుడు వెళ్లిపోయాడు.

తరవాత కణ్వాశ్రమానికి దూర్వాసుడు వచ్చాడు. శకుంతల దుష్యంతుణ్ణి గురించే ఆలోచిస్తూ అతిథి వచ్చిన సంగతి గమనించలేక పోయింది. దానికి దూర్వాసుడు అలిగి, "నీ భర్త నిన్ను గుర్తించక పోవుగాక!" అని శపించాడు.

పువ్వులు కోసుకుని వచ్చే అనసూయా ప్రియంవదలు కోపంగా వెళ్లిపోతున్న అతిథిని



చూసి దూర్వాసుడని గుర్తించారు. శకుంతల చేసిన అపచారం అర్థమయింది. ప్రియంవద ఆయన కాళ్లపై పడి వెళ్లిపోవద్దనీ, ఆగ్రహించ వద్దనీ బతిమాలింది. దూర్వాసుడు ఉండ టానికి ఒప్పుకోలేదు గాని శకుంతలకు తాను పెట్టిన శాపం, దుష్యంతుడు తాను శకుంతల కిచ్చిన ఉంగరాన్ని చూడగానే తీరిపోయే టట్టు అనుగ్రహించాడు. ఆ ఉంగరం శకుంతల చేతినే ఉన్నది గనక శాపభయం ఏమీ ఉండదని వారు సంతోషించారు.

రోజులు గడుస్తున్నాయి. దుష్యంతుడు శకుంతలను పిలువబంపలేదు. శాపంవల్ల ఆయన పూర్తిగా శకుంతల మాటే మరి చాడు. శకుంతలకు నెల తప్పింది. కణ్వుడు తిరిగివస్తే శకుంతల రహస్య వివాహం గురించీ, ఆమె గర్భిణిగా ఉండటం గురించీ ఆయనతో ఎలా చెప్పటమా అని అనసూయా ప్రియంవదలు మథనపడ్డారు.

కాని కణ్వుడు అశరీరవాణిద్వారా శకుం తలా దుష్యంతులకు వివాహమయిందనీ, శకుంతల గర్భంలో చక్రవర్తి కాబోయేవాడు పెరుగుతున్నాడనీ విన్నాడు. ఆయన ఆశ్ర మానికి వస్తూనే శకుంతలను దీవించి ఆమెను భర్తదగ్గిరికి పంపే ప్రయత్నాలు చేశాడు. శకుంతల వెళ్లిపోతుంటే అందరూ కంట తడి పెట్టారు. కణ్వుడు ఆమెకు అత్త



వారింట ఎలా మసలుకోవాలో బోధించాడు. అనసూయా ప్రియంవదలు శకుంతలకు దూర్వాసుడి శాపం గురించి చెప్పనేలేదు. వారిప్పుడామెతో, "చెలీ, నిన్ను నీ భర్త ఒకవేళ మరిచిపోతే అయనకు ఉంగరం చూపించు!" అన్నారు.

"నేను మళ్ళీ ఈ ఆశ్రమానికి ఎప్పుడు వస్తానో!" అన్నది శకుంతల.

"అమ్మా, నీ కొడుకు పెద్దవాడై రాజ్యాభిషేకం చేసుకున్నాక నీవూ, నీ భర్తా తపస్సుకోసం వద్దురుగాని," అన్నాడు కణ్వుడు.

శకుంతలను కొంతదూరం సాగనంపి ఆశ్రమవాసులు వెనక్కు తిరిగారు. గౌతమి అనే తాపసస్త్రీ, కణ్వుడి శిష్యులూ శకుంతలను వెంటబెట్టుకుని హస్తినగరం చేరారు.

దుష్యంతుడితో నౌకర్లు, "తమ దర్శనార్థం కణ్వమహాముని ఆశ్రమంనుంచి కొందరు మునులూ, స్త్రీలూ వచ్చి ఉన్నారు," అని చెప్పారు. వారికి అర్ఘ్యపాద్యా లివ్వటానికి రాజు తన పురోహితుణ్ణి పంపి, వచ్చినవారితో మాట్లాడటానికి తాను అగ్నిహోత్ర గృహానికి వెళ్లాడు.

కొంచెంసేపటిలో శకుంతలను వెంటబెట్టుకుని గౌతమీ, మునులూ వచ్చారు. శకుంతల మేలిముసుగు వేసుకుని ఉన్నది. ఆమె ఎవరోగదా అనుకుంటూ దుష్యంతుడు





మునులతో, "తపస్సు సరిగా సాగుతున్నదా? కణ్వమహాముని కుశలంగా ఉన్నారా?" అని అన్నాడు.

మునులు క్షేమ సమాచారాలు తెలిపిన మీదట రాజుతో, "ఎవరికీ తెలియకుండా మీరు కణ్వపుత్రిని ఈ శకుంతలను పెళ్లాడారట. ఈమె గర్భిణిగా ఉన్నది. పెళ్లి అయిన స్త్రీలు భర్తవద్ద ఉండటంకంటె ఉత్తమ మార్గం లేదని ఈమెను కణ్వమహాముని పంపారు. ఈమెను ఏలుకోండి!" అని చెప్పారు.

శాపంచేత అంతా మరిచిపోయిన దుష్యంతుడు, "ఏమిటిదంతా? మీ మాటలు చిత్రంగా ఉన్నాయే!" అన్నాడు. శకుంతల మేలిముసుగు తీసినా రాజామెను గుర్తించలేదు. ఎన్నో ఆనవాళ్లు చెప్పింది, లాభం లేకపోయింది. తన వేలినుంచి ఉంగరం తీయపోయింది. ఉంగరం లేదు; అది దారిలో శక్రావతార తీర్థం వద్ద నీటిలో పడిపోయింది.

దుష్యంతుడు ఇదంతా ఏదో మోసమనుకున్నాడు. బుద్ధిపూర్వకంగా అతనే శకుంతలను మోసగించి ఆమె బతుకు బండలు చేస్తున్నాడనుకున్నారు మునులు. వాళ్ళు శకుంతలను వదిలేసి బయలుదేరారు. శకుంతల ఏడుస్తూ వారివెంట పడింది. వారామెను మందలించి వెళ్ళిపోయారు.

రాజ పురోహితుడు రాజు అనుమతితో శకుంతలను ప్రసవం కలిగేదాకా తన ఇంట ఉంచుకుందామనుకుని వెంటపెట్టుకుని పోతూ ఉండగా దారిలో ఒక స్త్రీలాటి ఆకారం ప్రకాశిస్తూ కనిపించి శకుంతలను ఎటో ఎత్తుకుపోయింది. ఈ సంగతి విని దుష్యంతుడు ఏమాత్రమూ విచారించలేదు.

ఒకనాడొక బెస్తవాడు శక్రావతార తీర్థంలో ఒక ఎర్ర చేపను పట్టి దాన్ని కోసే సరికి ఒక ఉంగరం దొరికింది. దాన్ని వాడు నగరంలో అమ్ముకోబోయి రాజ భటులకు

చిక్కాడు. ఎలాగైతేనేం ఉంగరం దుష్యంతుడికి చేరింది. దూర్వాసుడి శాపం తీరిపోయింది. దుష్యంతుడికి జరిగినదంతా జ్ఞాపకం వచ్చింది.

అయన శకుంతలను తలుచుకుని కన్నీరు కార్చాడు. తన రాజ్యంలో వేడుక లేవీ జరగరాదని శాసించాడు.

కొంతకాలం గడిచింది. ఇంద్రుడు రాక్షసులతో యుద్ధం చెయ్యటానికి సహాయంగా దుష్యంతుణ్ణి తెమ్మని మాతలిని రథంతో పంపాడు. దుష్యంతుడు ఆ రథమెక్కి వెళ్లి రాక్షసులతో యుద్ధంచేసి గెలిచి తిరిగి వస్తూ, దారిలో హేమకూట పర్వతం కనిపించగా, అక్కడ మారీచ మహాముని ఆశ్రమం ఉన్నదని మాతలిద్వారా తెలుసుకుని అక్కడ దిగాడు.

ఆశ్రమం ప్రవేశిస్తూనే ఆయనకొక చిత్రమైన దృశ్యం కంటబడింది. ఒక బాలుడు ఒక సింహపుపిల్లను, తల్లిదగ్గిర పాలు తాగుతున్నదాన్ని, పట్టుకొచ్చాడు; ఆశ్రమ స్త్రీలు, "దాన్ని విడిచిపెట్టు, బాబూ! ఏడిపించకు!" అని బతిమాలుతున్నారు. కుర్రాడు వాళ్లను లక్ష్యం చెయ్యటంలేదు.

స్త్రీలు దుష్యంతుణ్ణి చూసి, కుర్రవాడి నుంచి సింహంపిల్లను విడిపించమని ఆయనను ప్రాథేయపడ్డారు. తరవాత వాడి



చేతికి రక్ష లేకపోవటం గమనించి, ఏమయిందా అని చూడసాగారు. "ఇదుగో!" అని దుష్యంతుడు కింద పడిన తాయెత్తు తీశాడు. "వద్దు, వద్దు!" అని మొదట అరిచిన స్త్రీలు నిర్ఘాంతపోయారు. ఎందుకంటే ఆ తాయెత్తును మారీచ మహాముని ఆ పిల్లవాడికి కట్టుతూ, దాన్ని కుర్రవాడి తలిదండ్రులు తప్ప ఇంకెవరు తాకినా పామై కరుస్తుందని చెప్పాడు. అలా చాలా సార్లు జరిగిందికూడా.

ఈ సంగతి వారిద్వారా వినగానే దుష్యంతుడు ఈ కుర్రవాడు తన కొడుకేననీ, శకుంతల ఆ ఆశ్రమంలోనే ఉన్నదనీ తెలుసుకున్నాడు.

ఈలోపుగా ఆశ్రమ స్త్రీలు శకుంతల వద్దకు వెళ్ళి జరిగిన సంగతి చెప్పారు.

తనను అప్సరసలు ఎత్తుకువచ్చి ఈ ఆశ్రమంలో ఉంచిన దగ్గిరనుంచీ దుష్యంతుడికి ఉంగరం దొరకటమూ, ఆయన తననే స్మరించుతూ దుఃఖంలో మునిగిపోయి వేడుకలన్నీ నిషేధించటమూ మొదలైన వార్తలు అప్సరసలద్వారా తెలుసుకుంటూనే ఉన్నదామె. ఇప్పుడామె చప్పున లేచి దుష్యంతు డున్నచోటికి వచ్చింది.

దుష్యంతు డామెను చూసి వెలవెలపోతూ తాను చేసిన అన్యాయానికి క్షమాపణ చెప్పుకున్నాడు. తప్పు అతనిది కాదనీ, తన రోజులు మంచివి కాక అలా జరిగిందనీ శకుంతల అన్నది. దూర్వాసుడి శాపం గురించి ఇద్దరికీ తెలియదు. ఆ విషయాన్ని వారు మరికొంతసేపటికి మారీచ మహాముని ద్వారా తెలుసుకున్నారు.

తరవాత దుష్యంతుడు తన భార్య అయిన శకుంతలనూ, సర్వదమనుడనే పేరుతో పెరుగుతున్న తన కొడుకునూ తీసుకుని స్వదేశానికి వచ్చాడు. ఆ సర్వదమనుడే భరతుడనే పేరుతో గొప్ప చక్రవర్తి అయి చిరఖ్యాతి సంపాదించాడు.





# బాధ సహించలేని వస్తాదు

ఒక పేరుమోసిన వస్తాదు ఉండేవాడు. తన పరాక్రమానికీ, ఖ్యాతికీ తగినట్టుగా తన రెండు చేతులమీదా సింహంబొమ్మలు పచ్చ పొడిపించుకోవాలని వాడికి కోరిక కలిగింది.

అందుకని వస్తాదు ఒక మంగలి వద్దకు వెళ్ళి, "నా చేతులమీద సింహాల బొమ్మలు పచ్చ పొడుస్తావా ఏమిటి? అసలు నేను సింహ లగ్నంలో పుట్టినవాణ్ణి, వల్లమాలిన ధైర్యసాహసాలు గలవాణ్ణికూడానూ," అని చెప్పాడు.

మంగలి సరేనని సూది తీసి వస్తాదు చేతిమీద పొడవసాగాడు. వస్తాదుకు సూది పోట్లు చాలా బాధ కలిగించాయి. రెండు మూడు పోట్లకే వాడు ఎక్కడలేని చిరాకుతో, "ఉండు, ఉండు! ఏం పొడుస్తున్నావు?" అని అడిగాడు.

"సింహం తోక పొడుస్తున్నాను," అన్నాడు మంగలి.

"సరిపోయింది! గొప్పవాళ్ళంతా తమ పెంపుడు కుక్కలకూ, గుర్రాలకూ తోకలు కత్తిరించేస్తారు, తెలుసా? తోకలేని సింహానికి పౌరుషం మహా జాస్తి. అంచేత తోక మానేసి మిగిలిన సింహం పొడు, చాలు!" అన్నాడు వస్తాదు.

మంగలి సరేనని మళ్ళీ పొడవసాగాడు.

"ఆగు, ఆగు! ఇప్పుడేం పొడుస్తున్నావు?" అన్నాడు వస్తాదు, సూదిపోటు కొంచెంకూడా భరించలేక.

"సింహం చెవులు పొడుస్తున్నాను," అన్నాడు మంగలి.

"ఏడిచినట్టే ఉంది! కుక్కలను పెంచే వాళ్ళు ఏం చేస్తారో నీకు తెలీదా? వాటి చెవులు కత్తిరించేస్తారు. పొడుగాటి చెవులుండే కుక్కలను ఎవరూ పెంచరు. సింహాలలోకూడా చెవులులేని సింహాలే శ్రేష్ఠం!" అన్నాడు వస్తాదు.

స్వామి రామతీర్థ

"సరే, అయితే చెవులు లేని సింహాన్నే పొడుస్తాను," అంటూ మంగలి మళ్లీ తన పని సాగించాడు.

వాడు చేతిమీద పొడిచినప్పుడల్లా వస్తాదుకు పంచప్రాణాలూ పోయినంత పని అవుతున్నది.

"తొందరపడకు, కొంచెం ఆగు! ఇప్పుడేం పొడుస్తున్నావు?" అని వస్తాదు మంగలిని అడిగాడు.

"సింహం నడుము పొడుస్తున్నాను," అన్నాడు మంగలి.

"అఘోరించినట్టే ఉన్నది! నువు ఏ జన్మానా కావ్యాలుకూడా చదువుకున్నట్టు లేదు. సింహాలకు నడుములే ఉండవని కవులు ఘోషిస్తున్నారు. ఒకవేళ ఉన్నా ఉండీ లేనట్టుంటాయిట. అందమైన ఆడవాళ్ల నడుములను సింహాల నడుములతో పోలుస్తారు. అదికూడా నీకు తెలిసినట్టు లేదు. అందుకే ఆడదాన్ని సింహేంద్ర మధ్యమ అంటారు. అంచేత నువు సింహానికి నడుము లేకుండానే చెయ్యి. అప్పుడు నీ బొమ్మ మరింత గొప్పగా వుంటుంది," అని వస్తాదు వుపన్యాసం దంచేశాడు.

ఇంత లావు వస్తాదుకూ సూదితో పొడిపించుకునే శక్తి లేదనీ, ఇది చివరెల్లా పచ్చ పొడిపించుకునే మేళం కాదనీ మంగలికి తెలిసిపోయింది. వాడు సూదినీ, రంగులనూ అవతల పెట్టి, "వస్తాదుగారూ, మీరు పచ్చ పొడిపించుకోనూ వద్దు, నేను పొడవావద్దు. నన్ను ఆటే బాధించక వచ్చిన దారినే దయ చెయ్యండి!" అన్నాడు.

ఈ మాటలతో వస్తాదుకు ఆశాభంగం కలగటానికి మారుగా ప్రాణం లేచి వచ్చినట్టయింది. "నీకు చాతకాకపోతే ఆ సంగతి ముందే నాతో చెప్పకపోయావా?" అని వాడు మీసం మెలివేసుకుంటూ చల్లగా ఇంటి దారి పట్టాడు. ఆరంభశూరత్వం ఇలాగే వుంటుంది.






మన దేశం ఎందరో వీర వనితలను కన్నది. దేశంకోసం ప్రాణాలు అర్పించీ, యుద్ధాలలో పరాక్రమం చూపీ, ఎంతో సమర్ధతతో రాజ్యాలను ఏలీ చరిత్ర ప్రసిద్ధి గన్న వీరవనితలు మనదేశంలో ఎందరో ఉన్నారు. అటువంటి వారిలో ఒకతె కాకతీయ రుద్రమదేవి.

దక్షిణ భారతదేశంలో సామ్రాజ్యాలు స్థాపించినవారిలో కాకతీయులు ఒకరు. కాకతీయ సామ్రాజ్యంలో ప్రజలు సుఖంగా ఉండేవారు. కళలూ, సంస్కృతీ బాగా విస్తరించాయి.

కాకతీయ రాజులలో గణపతిదేవుడు ఒకడు. ఈయనకు ఒకే ఒక కుమార్తె కలిగింది. ఆమె రుద్రమ్మ. తండ్రి అనంతరం సామ్రాజ్యాన్ని ఏలవలసినది కావటంచేత రుద్రమ్మ చిన్నతనంనుంచీ కత్తిసామూ, గుర్రపుస్వారీ, యుద్ధతంత్రమూ, రాజ్యతంత్రమూ మొదలైనవన్నీ నేర్చుకున్నది.

రుద్రమ్మ తల్లి నారమ్మ. తనకున్న ఒక్క కూతురూ లలితకళలు నేర్చుకోవటానికి బదులు ఇలా మగవాడిలాగా యుద్ధ విద్యలు అభ్యసించటం ఆమెకు కొంచెంకూడా నచ్చలేదు. ఇదేమీ బాగాలేదని ఆమె తన భర్త అయిన గణపతిదేవుడితో చాలాసార్లు అన్నది. కాని గణపతిదేవుడు ఆమెకు ఎలాంటి సమాధానం చెప్పక చిరునవ్వు నవ్వి ఊరుకునేవాడు.

రుద్రమ్మ ధోరణి ఆమె చెలికత్తెలకు కూడా ఏమాత్రమూ నచ్చలేదు. రుద్రమదేవి మామూలు రాజకన్యలలాగే ఉండి, మంచి నగలూ, నాణ్యాలూ ధరించి, సుకుమారంగా పెరిగి, యుక్తవయసు రాగానే తగిన వరుణ్ణి పెళ్ళాడి పిల్లలను కనటం మంచిదని వారి ఉద్దేశం.

అందుచేత ఆమె బుద్ధి మార్చటానికి గాను వారందరూ కూడబలుక్కుని ఒక

ఆలోచన చేశారు. ఒకనాడు రుద్రమదేవి ఉద్యానవనంలో కూచుని ఉండగా, చెలి కత్తెలు ఒకరితరవాత ఒకరుగా వచ్చి, "జయము, జయము యువరాజుకు!" అని అన్నారు.

ఈ మాటలు విని రుద్రమ్మ బిడియపడి పోతుందని వారి ఉద్దేశం. కాని అటువంటి దేమీ జరగలేదు.

రుద్రమ్మ వాళ్ళకేసి నిశ్చలంగా చూసి, "యువరాజువల్ల మీకు కావలిసిన పని ఏమిటి?" అని అడిగింది.

చెలికత్తెలు ఏమనటానికీ తోచక ఒకరి మొహాలొకరు చూసుకున్నారు.

"ఎందుకు సంకోచిస్తారు? మీ కోరిక ఏమిటో తెలపండి. దానిని తీర్చటానికి నేను సిద్ధంగా ఉన్నాను," అన్నది రుద్రమ్మ.

తమ కడుపులో ఉండే ఉద్దేశం పూర్తి చేసుకోవటానికి ఇదికూడా మంచి అవకాశమేనని చెలికత్తెలకు తోచింది. వారు రుద్రమ్మతో, "మాకు వేరే కోరిక ఏమీ లేదు. మీరు ఆయుధాలు ముట్టనని మాకు మాట ఇస్తే చాలు!" అన్నారు.

తనచేత అస్త్రవిద్యాభ్యాసం మాన్పించాలని వారికి గల మొండిపట్టు చూసి రుద్రమ్మకు మండిపోయింది. తాను ఆయుధ విద్యలు అభ్యసించటం తన తండ్రికి ఎంతో



ఇష్టం. అందుచేత వాటిని మానే ఉద్దేశం ఆమెకు ఏ కోశానా లేదు. అయితే తన చెలికత్తెలు ఏమి కోరితే అది చేస్తానని అన్నది గనక రుద్రమ్మ వారితో, "మీరు కోరినట్టు నేను అస్త్రసన్యాసం చేస్తాను. కాని అందుకు ఒక షరతు ఉన్నది. అదేమిటంటే, నన్ను ఎవరైనాసరే అస్త్రవిద్యలో ఓడించ కలగాలి. ఆ తరవాత అస్త్రసన్యాసం తప్పక చేస్తాను," అన్నది.

ఆమె చెలికత్తెలు ఈ మాటలకు చాలా సంతోషించి, ఈ శుభవార్తను రుద్రమ్మ తల్లి నారమ్మకు కూడా తెలియజేశారు. చెలికత్తెలలాగే నారమ్మకూడా తన కూతురు అస్త్రాల పోటీలో సులువుగా ఓడిపోతుం దనుకున్నది.

ఆమె మంత్రిని పిలిచి, "అమ్మాయిని కత్తిసాములో ఓడించగలవాణ్ణి ఒకణ్ణి చూసి పిలిపించాలి," అన్నది.

మంత్రి నవ్వి, "కత్తిసాములో అమ్మాయిని జయించగలవాళ్ళున్నారని నాకు తోచదు," అన్నాడు.

నారమ్మ ఆశ్చర్యపడి, "అంత చోద్యంగా చెబుతారేమిటి? నిన్నగాక మొన్న కత్తిసాము నేర్చిన అమ్మాయిని ఓడించే వాళ్ళే దేశంలో లేరంటే నమ్మటం ఎలా?" అన్నది.



"నేను ఇచ్చకాలకు మాట్లాడటంలేదు, మహారాణీ. మన సేనాని కొడుకు కత్తిసాములో చాలా గట్టివాడు, ఎందరినో ఓడించిన వాడు. కావలిస్తే అతనికీ, అమ్మాయికీ కత్తిసాములో పోటీ పెట్టి చూడవచ్చు," అన్నాడు మంత్రి.

మర్నాడే సేనానికొడుకుకూ, రుద్రమ్మకూ కత్తిసాములో పోటీ ఏర్పాటుచేశారు. ఈ కత్తిసాము జరిగేటప్పుడు రాణి నారమ్మా, మంత్రీ కూడా ఉన్నారు.

పోటీ ఎంతోసేపు జరగలేదు. త్వరలోనే రుద్రమ్మ తన ప్రత్యర్థిని నిరాయుధుణ్ణి చేసి పోటీలో గెలిచింది.

రాణి నిర్ఘాంతపోయింది. కాని తన కుమార్తెచేత అస్త్రసన్యాసం చేయించాలన్న పట్టుదల మటుకు మరింత అయింది. ఆమె గణపతిదేవుడి అనుమతి పొంది దేశదేశాల చాటింపు వేయించింది. ఆ చాటింపు ఉద్దేశం ఏమిటంటే, ఎవరైనాసరే రుద్రమ్మను అస్త్ర విద్యలో ఓడించినట్టయితే వారికి సేనాని పదవి ఇస్తామని.

ఈ చాటింపు విని ఎందరో యోధులూ, రాజకుమారులూ రుద్రమ్మను ఓడించటానికి వచ్చారు. కాని వారిలో ఒక్కరుకూడా రుద్రమ్మను ఓడించలేకపోయారు. అందుచేత రుద్రమ్మ అస్త్రసన్యాసం చేయనేలేదు.

గణపతిదేవుడికిలాగే రుద్రమ్మకుకూడా ఆడపిల్లలే కలిగారు. అందుచేత ఆమె తన కూతురి కొడుకైన ప్రతాపరుద్రుణ్ణి పెంచుకున్నది. గణపతిదేవుడి తదనంతరం రుద్రమ్మ కాకతీయ సామ్రాజ్యాన్ని చాలా కాలం పరిపాలించింది. ఆమె రాజ్యంచేస్తూ ఉండగా ప్రతాపరుద్రుడు యువరాజుగా ఉండి కొంత రాజ్యభారాన్ని కూడా పంచుకున్నాడు.

రుద్రమదేవి రాణిగా చాలా సమర్థురాలు. ఆమె పరిపాలన కాకతీయ సామ్రాజ్యానికి ఒక స్వర్ణయుగంలాటిది.





"నా కుక్కపిల్ల తప్పిపోయిందే!"
"మీ నాన్నతో చెప్పి పేపర్లో ప్రకటన వేయించరాదూ?"
"లాభంలేదే-మా జానీకి పేపరు చదవడం రాదు."



"నోరల్లా బిగించు కూర్చుంటే ఎలా చెప్పమ్మా? బుజ్జిగాదూ—కొంచెం 'ఆ' అను. డాక్టరుగారు వేలు తీసేసు కుంటారు."



"ఆ పన్ను కాదండోయ్! ఓదాని కోటి తీశేశారు."
"ఖంగారు పడితే ఎలాగయ్యా? వస్తున్నా వస్తున్నా—ఆ పన్నూ తీశేదాం-దానికేం భాగ్యం."



"పడితే పడ్డావుగానీ, అదృష్టవంతుడి వయ్యా! డాక్టరింటి ముందే జారి పడ్డావ్."
"నేనేనయ్యా, డాక్టర్ని."

ఎస్. శంకరనారాయణ, మద్రాసు.

# ఖుళుక్కు!

ఒక అడవిలో ఒక మడుగు పక్కన కొన్ని చెవుల పిల్లులు ఆకులు తింటుండగా మడుగు పక్కన ఉండే చెట్టుపైనుంచి పండొకటి పడి "ఖుళుక్!" అని చప్పుడయింది.

"అమ్మయ్యో, ఖుళుక్!" అంటూ చెవుల పిల్లులు చెంగు చెంగున దూకుతూ పరిగెత్తసాగాయి.

వాటికి ఒక నక్క ఎదురై, "ఎందుకు అలా పరిగెత్తుతున్నారు?" అని అడిగింది.

"ఖుళుక్కు వస్తోంది! నువుకూడా పారిపో!" అన్నాయి చెవుల పిల్లులు. నక్కకూడా వాటితో పరిగెత్తసాగింది.

వాటికి ఒక ఎలుగుబంటి ఎదురయింది. ఖుళుక్కు వస్తున్నదని విని అదికూడా పరిగెత్త నారంభించింది.

కొద్ది సేపట్లో అడవిలోని దుప్పులూ, ఖడ్గమృగాలూ, చిరతపులులూ, తోడేళ్లూ, దుమ్ముల గొండ్లూ—సమస్త మృగాలూ పరిగెత్తసాగాయి.

వాటికి సింహం అడ్డుతగిలి, "ఏమిటిది? మీరంతా ఎందు కిలా పారిపోతున్నారు?" అని అడిగింది.

"ఖుళుక్కు వస్తోంది!" అని జంతువులు చెప్పాయి.

"దాని సంగతి నేను చూస్తాను. ఆ ఖుళుక్కు ఎక్కడో నాకు చూపండి!" అన్నది సింహం. చెవుల పిల్లులు దారి చూపుతూ నీటి మడుగుదగ్గిరికి సింహాన్ని తెచ్చాయి. సరిగా ఆ సమయానికే చెట్టునుండి మరొక పండు ఖుళుక్కున నీటిలో పడింది.

"అదుగో మీ ఖుళుక్కు! వెళ్లి మీమీ పనులు చూసుకోండి!" అన్నది సింహం.





# కొయ్యగుఱ్ఱం

ఒకనాడు ఒక వడ్రంగీ, ఒక కమ్మరీ వాదించుకున్నారు.

"నేను నీకంటె నేర్పరిని?" అన్నాడు వడ్రంగి.

"అదేమన్నమాట? నేను నీకంటె ఎన్నోరెట్లు నేర్పరిని," అన్నాడు కమ్మరి.

ఈవిధంగా వాళ్లు ఎంతసేపు వాదించుకుని కూడా ఎటూ తేల్చుకోలేకపోయినారు. అందుచేత వాళ్లు రాజుగారి నడిగి ఎవరు నేర్పరి అయినదీ తేల్చుకుందామనుకున్నారు.

రాజు వారిద్దరినీ చూసి, "ఏం పనిమీద వచ్చారు?" అని అడిగాడు.

వడ్రంగి ఈవిధంగా చెప్పాడు: "అయ్యా, నేను వడ్రంగిని. నా పనితనంతో ఎన్నో చిత్రవిచిత్రమైన వస్తువులు తయారుచేసి ఉన్నాను. కాని ఈ కమ్మరి నాకన్న తాను ఎక్కువ నేర్పరితనం గలవాణ్ణని వాదిస్తున్నాడు."

"నా పనితనం చూసినవాళ్ళంతా నన్ను వెయ్యినోళ్ళ పొగడుతున్నారు. అయినా ఈ వడ్రంగి నాకన్న తెలివిగలవాణ్ణని అంటున్నాడు," అన్నాడు కమ్మరి.

"మహారాజా, మా ఇద్దరిలోనూ ఎవరి పనితనం గొప్పదో తమరే తేల్చాలి!" అని ఇద్దరూ రాజును వేడుకున్నారు.

తీర్పు ఎలా చెప్పాలో రాజుకు తోచలేదు. "మీ ఇద్దరి పనితనమూ మేము చూడలేదు. అలాటప్పుడు మీ ఇద్దరిలో ఎవరు నిపుణులో ఎలా తేల్చటం? మీరిద్దరూ వెళ్ళి చెరొక

సి. మాధవరావు





వస్తువూ తయారు చేసి పది రోజులలో తిరిగిరండి. మీరు తయారు చేసిన వస్తువులను పరిశీలించి, మీలో ఎవరి పనితనం హెచ్చో నిర్ణయిస్తాము!" అన్నాడాయన.

వడ్రంగీ, కమ్మరీ రాజుగారి వద్ద సెలవు తీసుకుని తమతమ ఇళ్లకు వెళ్ళిపోయి పని ప్రారంభించారు. పదోరోజున కమ్మరి ఒక ఇనప చేపను తయారుచేసి తెచ్చి రాజుగారికి సమర్పించాడు.

"ఇది ఎందుకు పనికివస్తుంది?" అని రాజు అడిగాడు.

"ఈ చేపమీద ఒకలక్ష ధాన్యపు బస్తాలు వేసినప్పటికీ నీటిలో మునగకుండా సముద్రంలో తేలిపోతుంది," అన్నాడు కమ్మరి. ఈమాట వినేసరికి రాజుకు నవ్వొచ్చింది. కమ్మరి పట్టి మూఢుడనీ, అవివేకంగా ప్రగల్భాలు పలుకుతున్నాడనీ ఆయన అనుకున్నాడు. ఆయన తన మనుషులతో, "ఈ చేపను సముద్రంలో ఉంచి దీనిపైన లక్ష బస్తాల ధాన్యం పెట్టి ఇది తేలిపోతుందేమో చూడండి," అన్నాడు.

రాజభటులు ఆ చేపను సముద్రంలో ఉంచి, దానిపైన ఒక లక్ష ధాన్యంబస్తాలు ఎక్కించారు. చిత్రంగా ఆ ఇనపచేప సముద్రంమీద ఈదుతూ కదిలింది.

రాజు కమ్మరి నేర్పరితనాన్ని ఎంతో మెచ్చుకుని అతన్ని తన నగరంలో ఒక వీధికి పెద్దగా నియమించాడు.

ఈలోపల వడ్రంగి కొయ్యతో ఒక గుర్రాన్ని చేసి పట్టుకొచ్చాడు. దాన్ని చూడగానే రాజుకు నిరుత్సాహం కలిగింది.

"ఇదేమిటి? చిన్నపిల్లలు ఆడుకునే వస్తువు చేసి తెచ్చావు. దీన్ని కమ్మరి చేసిన ఇనప చేపతో పోటీ పెడదామనేనా నీ ఉద్దేశం?" అని రాజు వడ్రంగిని అడిగాడు.

"మహారాజా, రెంటికీ పోలిక ఏమిటి? దీనిముందు ఆ ఇనపచేప ఏపాటిది? ఈ వరసగా ఉన్న ఇరవైఆరు మరలూ చిత్తగిం



చండి. వీటిలో మొదటిది వదులు చేస్తే చాలు గుఱ్ఱం గాలిలోకి ఎగురుతుంది. ఆ తరవాత ఒక్కొక్క మరే వదులు చేసిన కొద్దీ గుఱ్ఱం వేగం హెచ్చిపోతుంది. అన్ని మరలూ వదులుచేస్తే ఇది వాయువేగాన్ని మించి ఎగురుతుంది. దీన్ని ఎక్కినవాళ్ళు ఆకాశంలో సంచరించటమే గాక అతి సులువుగా ప్రపంచమంతా చుట్టి రావచ్చు!" అన్నాడు వఱ్ఱంగి.

వఱ్ఱంగి ఈ మాటలు అంటూండగా రాజుగారి ఆఖరుకొడుకు అక్కడికి వచ్చాడు. ఎగిరే గుఱ్ఱమన్న మాట వింటేనే వాడికి ఎక్కడ లేని ఉత్సాహమూ పుట్టుకొచ్చింది. ఆకాశంలో ఎగురుతూ కిందికి చూస్తే ప్రపంచం కనిపించటం ఎంత సరదాగా ఉంటుందోగదా అనుకున్నాడు వాడు. ఆ గుఱ్ఱంమీద ఎక్కి ఒక్క షికారు తిరిగిరావటానికి అనుమతి ఇవ్వమని వాడు తండ్రిని బతిమాలాడు.

"ఇంకా నయం! అసలది ఎగురుతుందో లేదో ఎవరు చూశారు? ఒకవేళ ఎగిరినట్టు ఎగిరి కిందపడిపోతే ఏంగాను?" అని రాజు కొడుకును మందలించాడు.

వఱ్ఱంగి రాజుగారి మాటకు అడ్డు వచ్చి, "మహారాజా, మీకు అలాటి అపోహ వద్దనే



వద్దు. ఏ పరిస్థితిలోనూ ఈ గుఱ్ఱం కింద పడి ప్రమాదం జరగదు," అన్నాడు.

రాజకుమారుడు తండ్రి దగ్గిర మారాం చెయ్యటం మానలేదు. తండ్రికి వాడంటే గారాబం, అందుచేత వాడి మాట తీసెయ్యలేక చివరకు ఒప్పుకున్నాడు. ఆయన రాజకుమారుడితో, "మరీ వేగంగా వెళ్ళకు సుమా. ఒక్క మర మాత్రమే వదులు చెయ్యి," అన్నాడు.

రాజకుమారుడు అందుకు ఒప్పుకుని కొయ్యగుఱ్ఱం ఎక్కి మొదటి మర వదులు చేశాడు. నిజంగానే గుఱ్ఱం గాలిలోకి ఎగిరింది. రాజకుమారుడు కిందికి చూస్తే

కొండలూ, నదులూ, చెట్లూ, మనుషులూ, నగరాలూ కనిపించాయి. వాడికి ఎక్కడ లేని ఉత్సాహమూ వచ్చింది. వాడు వరసగా ఇరవైఆరు మరలూ వదులుచేశాడు. కొయ్య గుర్రం అంతులేని వేగంతో పోసాగింది.

అలా చాలాసేపు ఆకాశంలో ప్రయాణించి నాక రాజకుమారుడికి ఆకలి వేసింది. అదృష్టవశాత్తూ వాడికి సమీపంలోనే ఒక నగరం కనబడింది. వాడు మరలన్నీ వరసగా బిగించాడు. గుర్రం వేగం క్రమంగా తగ్గింది. అది పక్షిలాగా దిగివచ్చి నేలపై వాలింది. వాడు సుష్టుగా భోజనంచేసి ఒక సత్రంలో బస ఏర్పాటుచేసుకున్నాడు.

ఆ రోజు వాడు చేసిన ప్రయాణం వాడి కెంతో సంతృప్తి నిచ్చింది. ఏమంటే, వాడు కొద్దిసేపట్లోనే ఎక్కడో ఉన్న నగరాన్ని, ఎన్నడూ చూడనిదాన్ని కొయ్యగుర్రం సహాయంతో చేరుకోగలిగాడు.

ఆ రాత్రి నిద్రపోయి మర్నాడు ఉదయమే నగరం చూడటానికి బయలుదేరాడు. రెండు వీధులు దాటేసరికల్లా ఒక చౌకు వచ్చింది. అక్కడ జనం నిలబడి తలలెత్తి శూన్యాకాశంలోకి చూస్తున్నారు. ఆకాశంలో ఏమీ లేదు. "వీళ్ళు ఎందుకిలా చూస్తున్నారా?" అనుకుని వాడు వారిని సమీపించి, ఒకణ్ణి పలకరించి,



"మీరంతా ఆకాశంలో ఏమిటి చూస్తున్నారు?" అని అడిగాడు.

ఆ మనిషి రాజకుమారుణ్ణి ఎగాదిగా చూసి పరదేశి అని గ్రహించి ఈ విధంగా చెప్పాడు: "మా రాజుగారి కొక కుమార్తె ఉన్నది. ఆమె జగదేకసుందరి. ప్రపంచంలో ఎక్కడా అంత అందగత్తె ఉండబోదు. ఆ కూతురంటే రాజుగారికి పంచప్రాణాలూనూ. ఆమెను ఇతరులు కళ్లతో చూసినా ఆయన సహించలేడు. ఆమె రాజభవనంలో ఉండినంతకాలమూ ఆయనకు కొంచెం కూడా మనశ్శాంతి లేకపోయింది. అందుచేత ఆయన ఆమెకోసం మబ్బులమీద ఒక గగన సౌధం కట్టించి. అందులో ఆమెను ఒక్కతెనూ ఉంచాడు రోజూ కాలకృత్యాలు పూర్తి కాగానే ఆయన గగన సౌధానికి వెళ్లి ఆమెను చూసి తిరిగి వస్తూంటాడు. ఇవాళ ఆయన వెళ్ళి కొంతసేపయింది. ఆయన రాకకోసం మేమందరమూ ఎదురుచూస్తున్నాం."

రాజకుమారుడికి ఇదంతా పట్టి కట్టు కథలాగా కనిపించింది. "మబ్బుల మీద ఇల్లు కట్టటం ఎలా సాధ్యమవుతుంది?" అని వాడు అడిగాడు.

"అది ఒక సిద్ధుడు తన మహిమచేత నిర్మించాడు. ఒక్క రాజుగారు మాత్రమే అక్కడికి వెళ్ళి రాగలరు," అన్నాడు అవ








అనుకున్నది. కాని ఆమె కొత్తవాణ్ణి చూసి తన తండ్రి కాదని గ్రహించి, ఆ వచ్చినవాడు ఎవరో దేవత అయి ఉంటాడనుకున్నది. ఎందుకంటే మామూలు మానవులెవరూ ఆ భవనం చేరలేరు. అతనికి స్వాగతం చెప్పే ఉద్దేశంతో ఆమె తన ఆసనంమీది నుంచి లేచి నిలబడింది.

రాజకుమారుడు తన కళ్లను తానే నమ్మలేకపోయాడు. ఎందుకంటే రాజకుమార్తె నిజంగా అపురూప సుందరే. అతనిలో ప్రేమ పొంగి పొర్లింది. "ఆహా, ఇటువంటిది నాకు భార్య అయితే నాకింకేం కావాలి?" అనుకున్నాడు వాడు.

రాజకుమార్తెకు కూడా రాజకుమారుడిపైన ప్రేమ పుట్టుకొచ్చింది. "మా నాన్న నన్ను ఇక్కడ నిర్బంధంలో ఉంచటం మూలంగా నేను ఎవరినీ చూడలేకుండా ఉన్నానుగద. ఇలాటి యువకుడు నన్ను ప్రేమించేటట్టయితే ఇంక నాకు కావలిసిందేమిటి?" అని ఆమె అనుకున్నది.

ఇద్దరూ ఒకరి మనసులొకరు అతి సులువుగా అర్థంచేసుకుని గాంధర్వ వివాహం చేసుకున్నారు. రాజకుమారుడు ఆ రాత్రి గగన సౌధంలో గడిపి, తెల్లవారుగట్ట తన కొయ్యగుర్రంమీద సత్రానికి తిరిగి వచ్చేశాడు.

తలి మనిషి. ఈ వింత విషయం రాజకుమారుడి మనసును ఆ రోజల్లా వేధించింది. ఆ గగన సౌధం సంగతి ఏమిటో తేల్చుకోవాలనే ఉద్దేశంతో వాడు ఆ రాత్రి బాగా చీకటి పడ్డాక తన కొయ్యగుర్రం ఎక్కి ఆకాశంలోకి ఎగిరాడు.

కొంత ఎత్తు ఎగిరేసరికి నిజంగానే గగన సౌధం కనిపించింది. వాడు తన గుర్రాన్ని ఆ భవనం దగ్గిరికి తీసుకుపోయి ద్వారంవద్ద దాన్ని నిలిపి, దిగి, లోపల ప్రవేశించాడు.

లోపలికి ఎవరో వస్తున్న అలికిడి విని రాజకుమార్తె తన తండ్రే వచ్చాడుకాబోలు





అతను వెళ్ళిన కొద్దిసేపటికి రాజు ఎప్పటిలాగే తన కుమార్తెను చూడవచ్చాడు. లోపలికి అడుగు పెడుతూనే ఆయనకు, ఎవరో పరాయివాళ్లు అక్కడికి వచ్చినట్టు అనుమానం తగిలింది. దానికి తోడు రాజ కుమార్తె మామూలుకన్న హెచ్చు ఉత్సాహంలో ఉన్నట్టు కనబడింది.

ఇది చూసి రాజుకు భరించరాని బాధ పుట్టుకొచ్చింది. ఆయన కూతురితో ఏమీ అనకుండా తన భవనానికి తిరిగివచ్చి, "గగన సౌధంలోకి ఎవరు వచ్చి ఉంటారు? ఎలా వచ్చి ఉంటారు?" అని తీవ్రంగా ఆలోచించసాగాడు.

రాజుగారు విచారంలో ఉండటం గమనించి మంత్రులు ఆయన విచారానికి కారణమేమిటని అడిగారు. ఆయన వారితో తన అనుమానం గురించి చెప్పి, "నేను తప్ప మరెవరూ అక్కడికి పోలేరుగదా! గడిచిన రాత్రి అక్కడికి వచ్చిన మనిషి ఎవరో వాణ్ణి ఎలా పట్టుకోవటమో కాస్త ఆలోచించి చెప్పండి!" అని అడిగాడు.

"మనవద్ద నలుగురు మహాయోధులున్నారు. మీరు వారిని గగన సౌధానికి తీసుకుపోయి ఈ రాత్రి ఆ భవనం నాలుగు మూలలా కాపలా ఉంచండి. రాత్రివేళ నిజంగా ఎవరన్నా అక్కడికి వచ్చేపక్షంలో వాళ్లు తప్పక వాణ్ణి పట్టుకుంటారు!" అన్నారు మంత్రులు.

"భేష్, ఈ ఆలోచన దివ్యంగావుంది," అని రాజు ఆ సాయంకాలం నలుగురు యోధులనూ గగన సౌధానికి నాలుగు మూలలా కాపలా ఉంచి ఇంటికి తిరిగి వచ్చాడు.

కాని ఈ యెత్తు పారలేదు. ఆ మహాయోధులు కాపలా కాస్తూనే నిద్రపోయారు. రాజకుమారుడు ఆ రాత్రి గగన సౌధానికి రానేవచ్చాడు. రాత్రంతా రాజకుమార్తెతో గడిపి తెల్లవారుఝామున వెళ్ళిపోయాడు.

—(ఇంకా వుంది)





# మూడు వరాలు

ఎక్కడో ఒక మారుమూల దేశంలో ఒక చిన్న గ్రామంలో ఒక ఆసామీ ఉండేవాడు. పెద్ద ధనికుడు కాకపోయినా అతనికి ఏలోటూ లేదు. అయినా అతను పిసినిగొట్టు, చూస్తూ చూస్తూ ఒకరికి పెట్టలేడు, తాను తినాలేడు.

అతడి భార్య కూడా అతనికి తగినదే. ప్రతి వస్తువూ అమిత పొదుపుగా వాడేది. వంట చేసేటప్పుడు ఒక్క నలుసైనా మిగల నిచ్చేది కాదు, ప్రాణం పోయినా వంటక మనేది పారేసేది కాదు.

ఈ దంపతులకు ఒక చంటికుర్రా డున్నాడు. వాణ్ణి గురించి తండ్రి ఎప్పుడూ, "వీడికి మీసాలు వస్తేగాని నేను సుఖ పడను," అంటూ ఉండేవాడు.

ఒకరోజు కుంభపోతగా వర్షం కురుస్తున్న సమయంలో ఎవరో మనిషి తలుపు తట్టాడు. ఆసామి వెళ్ళి తలుపు తీశాడు. బయట ఉన్న మనిషి చప్పున లోపలికి వచ్చి, "అబ్బ, ఏమి వాన! చాలా దూరంనుంచి వస్తున్నాను. ఇంకా ఎంతో దూరం వెళ్లవలసి వున్నది. ఈ పూట ఇక్కడ తల దాచుకోక తప్పదు!" అన్నాడు.

"అయ్యో, ఇల్లంతా తడి చేసేస్తున్నావు!" అని ఇంటావిడ విలవిల్లాడింది.

"మీ దంపతులిద్దరినీ చూస్తే అతిథి సత్కారం చేసేవాళ్లులాగే ఉన్నారు. ఇంకా నయం, మంచిచోట అడుగుపెట్టాను. ఈ రాత్రికి మీరు తాగే గంజే నాకూ కూడా పొయ్యండి. రాత్రికి ఇక్కడే పడుకుని తెల్లవారాక నా దారిన నేను పోతాను," అన్నాడు అతిథి.

తాము ఏమీ అనకుండానే ఈ మనిషి తనను వాళ్లు ఆదరించినట్టుగా మాట్లాడటం చూసి భార్యాభర్తలు నిర్ఘాంతపోయారు; కాని, "ఉండటానికి వీల్లేదు. ఇంకెక్కడి కైనా వెళ్ళు," అనటం వాళ్ళకు సాధ్యం

హెచ్. వాసుదేవరావు

షిని కాక ఏ దేవతనో అనుకోండి. మీరు ఇచ్చిన ఆతిథ్యానికి నేను సంతోషించి మీకు మూడు వరాలిస్తానంటే మీరేం కోరుకుం టారు? ఒకరితరవాత ఒకరుగా కోరు కోండి!" అన్నాడు.

అతిథి వేళాకోళానికే ఈ మాటలంటున్నా డనీ, అతను ఎవరో పిచ్చివాడై ఉంటాడనీ ఆసామికి అనిపించింది. ఆయన తన మామూలు ధోరణిలో, "నాకు పెద్ద కోరిక లేమీ లేవులెండి. మా పసివాడికి ఎంత తొందరగా మీసాలు వస్తే నేను అంతగా సుఖపడిపోతాను!" అన్నాడు.

"ఏమమ్మా, నీ కోరిక ఏమిటి?" అని అతిథి ఇంటావిడను అడిగాడు.

అమాయకురాలు కావటంచేతనో, ఆడది గనకనో, ఆవిడకు వరాలనగానే మంచి కోరిక కోరుకోవాలనిపించింది. అందుచేత ఆవిడ అతిథితో, "నా కోరిక ఏమిటంటే నండీ, నేను చేత్తో ఏది పట్టుకున్నా సరే అది బారెడు పొడుగున పెరిగిపోవా లండీ!" అన్నది.

ఇలా కోరటంలో ఆవిడ ఉద్దేశమేమి టంటే: కూరలు తరిగేటప్పుడు తాను ఒక చిన్న కాయగూర ముట్టుకుంటే అది బారెడు పెరిగి రెండుపూటలా సరిపోవాలి;



అలాగే ఒక బంగారు కాసు పట్టుకుంటే అది బారెడు పొడుగు బంగారు కడ్డీగా పెరిగిపోయి అంతులేని బంగారం ఇల్లంతా నిండాలి!

భార్యాభర్తలిద్దరి కోరికలూ వినగానే అతిథి పెద్దగా నవ్వి, "భేష్! మీ కోరి కలు తీర్చేశాను పొండి. నేను నిజంగా దేవ తనే!" అన్నాడు.

అతిథి ఈ మాట అన్నాడో లేదో, తొట్టెలో పడుకున్న చంటివాడు కెవ్వున ఏడిచాడు.

ఆసామి తొట్టె దగ్గిరికి వెళ్ళి చూసును గదా, పసివాడి మూతికి ఇంతంత బుర్ర మీసాలున్నాయి.

సరిగా అదే సమయంలో అసామి భార్య తపీమని తుమ్మి అప్రయత్నంగా ముక్కు తుడుచుకున్నది. వెంటనే బుర్రుమని ఆమె ముక్కు పెరిగి నేలను తాకింది.

భార్యాభర్తలిద్దరూ లబోమని గోలెత్తారు.

"చంటివెధవకు ఇంతేసి మీసాలేమిటి? వాడు గుక్కపట్టి ఏడుస్తున్నాడు!" అన్నాడు అసామి విచారంగా.

"ఈ ముక్కేమిటి? ఇది పెట్టుకుని నలుగురి ఎదటికీ పోయేదెలా?" అన్నది అసామి భార్య.

ఇద్దరికీ మతులు చెడిపోయాయి. "అంతా ఈ పాపిష్టివాడే చేశాడు!" అన్నాడు అసామి అతిథికేసి వేలు చూపిస్తూ.

"ఇందులో నా తప్పేమీ లేదు. మీరిచ్చిన అతిథ్యానికి సంతోషించి మీకు వరాలిస్తా నంటే మీరే కోరుకున్నారు. వరం కోరుకునే టప్పుడు ఆలోచించి మరీ కోరుకోవలిసింది. అయినా మీకింకా ఒక వరం మిగిలిఉంది. ఈసారయినా కాస్త జాగ్రత్తగా ఆలోచించి మరీ కోరుకోండి!" అన్నాడు అతిథి.

అతనిలో ఏదో మార్పు వచ్చింది. అత నిప్పుడు మామూలు మనిషిలాగా లేడు. అతని ఒళ్ళంతా దేదీప్యమానంగా ప్రకాశిస్తున్నది. అతని ఒంటిమీద బట్టలు కూడా ధగధగలాడుతున్నాయి.

భార్యాభర్తలిద్దరూ ఆయన ముందు సాష్టాంగపడి, "అతిథిగా వచ్చిన నీకు తగిన ఆతిథ్యం ఇవ్వనందుకు మన్నించు, తండ్రీ. మాకు వేరే వరం ఏదీ వద్దు. మాకిచ్చిన రెండు వరాలూ రద్దుచెయ్యి!" అన్నారు.

వారు లేచి చూసేసరికి అతిథి లేడు. అయితే పిల్లాడు ఏడుపు మానేశాడు. వాడి మీసాలూ పోయాయి, ఇల్లాలి ముక్కూ మామూలుముక్కయింది.

ఆ తరవాత ఆ భార్యాభర్తలు లోభం మాని ఇంటికి వచ్చిన అతిథులను సరిగా సత్కరిస్తూ వచ్చారు.





# ఆఖరు గడియ

పూర్వం జర్మనీలో ఒక గొప్ప యోధుడుండే వాడు. వాడు యోధుడేగాని గజదొంగ కూడానూ. వాడు చేసే దోపిడీలు సాహస వంతంగా ఉండేవి. రహదార్ల వెంట వెళ్ళే వర్తక సిబ్బందులపై బడి దోచుకుని వాడు అంతులేని ధనం కొల్లగొట్టాడు.

వాడిపైన రాజుగారికి ఎన్నో ఫిర్యాదులు వెళ్ళాయి. వర్తకులు ఆత్మరక్షణకోసం ఎన్నో ప్రయత్నాలు చేసుకుని బయలుదేరేవారు. కాని దొంగా, వాడి అనుచరులూ మెరుపులాగా ప్రత్యక్షమై, తమ పని కానిచ్చుకుని మెరుపులాగా మాయమవుతూండేవారు. ఈ కారణంచేతనే రాజభటులు కూడా వాణ్ణి పట్టుకుందామని ఎన్నో ప్రయత్నాలు చేసి విఫలులయారు.

రానురాను ఈ గజదొంగ అంటే అందరికీ ఏవగింపు పుట్టుకువచ్చింది. మొదట వాడి సాహసాన్నీ, శౌర్యాన్నీ మెచ్చుకున్న వాళ్ళు కూడా వాడి చావు కోరసాగారు. చివరకు వాడికి శత్రువులు తప్ప మిత్రులెవరూ లేకుండా పోయారు.

ఈ గజదొంగకు నిజమైన మిత్రుడెవరన్నా ఉంటే అది వాడి గుర్రం. అది నిజంగా అసాధారణమైన గుర్రం. దానికి తన యజమాని మనస్సు అర్థమైనట్టే ఉండేది. వాడు ఎవరికీ చిక్కకపోవటానికి ముఖ్య కారణం ఆ గుర్రమే.

చిట్టచివరకు గజదొంగ పాపం పండి పరిపక్వమయింది. వాణ్ణి ఒకనాడు రక్షకభటులు గుర్రంతోసహా పట్టుకుని రాజుగారి కోటకు తెచ్చారు.

రాజు వాణ్ణి చూసి, "వీడు చాలా ఏళ్ళుగా ప్రజలను పీడించుకు తిన్నాడు, దేశంలో శాంతి లేకుండా చేశాడు. అందుచేత వీడికి మరణదండన విధిస్తున్నాను. వీణ్ణి నిరాయుధుణ్ణి చేసి ఈ రాత్రికి చీకటికొట్టులో ఉంచి

బి. వెంకటరత్నం





రేపు బహిరంగంగా ఉరితీయించండి!" అని ఆజ్ఞాపించాడు.

గజదొంగను చీకటికొట్లో వేశారు. వాడి గుర్రాన్ని రాజుగారి అశ్వశాలలో కట్టేశారు. కోటగోడల మధ్యగా రాజభవనం ఎదట ఉన్న మైదానం మధ్యను ఉరికంబం సిద్ధంచేశారు.

మర్నాడు ఆ ఆవరణం జనంతో కిటకిట లాడిపోయింది. గజదొంగ చావు కళ్ళారా చూసి సంతోషించాలని నగరంలో ఉన్న వాళ్ళంతా వచ్చి, కోటగోడలవెంబడి నిల బడ్డారు. రాజభటులు గజదొంగను ఖాళీ ప్రదేశం మధ్య నిర్మించిన ఉరికంబానికి పెడ రెక్కలు విరిచికట్టి తెచ్చారు. గజదొంగ ఎంత ప్రజాకంటకుడైనా ధీరుడే. వాడు ధైర్యంగా చావదలుచుకున్నాడు; అందు చేత గట్టిగా గొంతెత్తి, "నన్ను చూడటానికి ఇన్నివేలమంది వచ్చారు. కాని ఇంతమంది లోనూ నా మేలుకోరినవాడు ఒక్కడుకూడా లేడు!" అంటూ పెద్దపెట్టున నవ్వాడు.

జనంలో ఏమీ సంచలనం కలగలేదు గాని, అశ్వశాలలో కట్టివేసిఉన్న గజదొంగ గుర్రం తన యజమాని గొంతు విని గుర్తించి గట్టిగా సకిలించింది.

గుర్రం సకిలింపు వినగానే దొంగ మొహం మారిపోయింది.

"నాకు మిత్రులెవరూ లేరనుకున్నాను, కాని అది పొరపాటు. నన్ను ఎల్లప్పుడూ ఒకేవిధంగా ప్రేమించిన నా గుర్రం ఉన్నది. దానికి వీడ్కోలు చెప్పకుండా ఎలా ప్రాణాలు వదలటం?" అనుకున్నాడు వాడు.

అంతవరదాకా దర్పంగా ఉన్నవాడల్లా అతి అణకువగా అయిపోయి, రాజుగారిని సమీపించి ఆ గజదొంగ, "మహారాజా, మిమ్మల్ని వేడుకుంటాను. నా ఆఖరు కోరిక తీర్చండి—ఒక్కసారి నా గుర్రాన్ని ఎక్కి స్వారిచెయ్యనివ్వండి! ఆ తరవాత నేను నిశ్చింతగా చచ్చిపోతాను," అన్నాడు.



రాజుగారు ఒక్కసారి చుట్టూ కలయ జూశాడు. గజదొంగను ఖాళీస్థలంలో తిరగ నిచ్చినందువల్ల నష్టం ఏమీ ఉండదు. చుట్టూ జనం ఉన్నారు. వారి వెనక బాగా ఎత్తయిన కోటగోడలున్నాయి. వాటి పైభాగాలు కూడా ఎంతో విశాలమైనవి. వాటి అవతల కందకం ఉన్నది.

కోట ద్వారాలలో ఎంతోమంది సాయుధు లైన భటులున్నారు.

అందుచేత ఆయన భటులను, "మీరు వెళ్ళి వీడి గుర్రాన్ని పట్టుకురండి. వీడి చేతి సంకెళ్ళు ఊడగొట్టండి!" అని ఆజ్ఞాపిం చాడు. కొందరు వెళ్ళి గుర్రాన్ని తెచ్చారు. కొందరు వాడి చేతులకున్న సంకెళ్ళు ఊడగొట్టారు.

గజదొంగ తన గుర్రంమీద ఎక్కి ఒక చుట్టు మెల్లిగా నడిపించాడు. ఆ గుర్రాన్ని, దానిపైవాణ్ణీ చూస్తుంటే ప్రజలకు ఎలా గైనా ముచ్చటవేసింది.

రెండో చుట్టు తిరిగి వచ్చేటప్పుడు గజ దొంగ గుర్రాన్ని కదను తొక్కించాడు.

మూడో చుట్టుకు దొంగ గుర్రాన్ని దౌడు తీయించాడు. ప్రజలు ఆశ్చర్యంతో కోలా హలం చేశారు. ఆ మూడో చుట్టు సవారీ చేస్తుండగానే దొంగకు ఒక వెర్రి ఆలోచన వచ్చింది. తాను రాజుగారి కింకరులచేత



ఉరి పడి ఎందుకు చావాలి? తాను సాహసిగా బతికాడుగనక సాహసమైన చావు వెయ్యిరెట్లు మేలు. తాను చచ్చి తన గుర్రం ఎవరి అధీనమో కావటంకంటె తానూ, గుర్రమూ ఒకే క్షణంలో చావటానికి ఇది మంచి అవకాశం!

ఈవిధంగా అనుకుని గజదొంగ గుర్రం వేగాన్ని మరింత హెచ్చించి దాన్ని కోట గోడకేసి తోలి కళ్లు గట్టిగా మూసుకున్నాడు. జనం చేసే హాహాకారాలు వాడికి వినిపించాయి. గుర్రం శరవేగంతో తమకేసి వస్తుంటే ఆ దిక్కుగా ఉన్న జనం చెల్లాచెదురుగా పరిగెత్తుతూ కేకలు పెట్టటం కూడా వాడికి వినిపించింది.

కాని ఆ తరవాత ఏమీ జరగలేదు. తాను గాని తన గుర్రంగాని గోడకు కొట్టుకున్న అదటు కలగలేదు. కాలమే ఆగిపోయినట్టు అనిపించింది. మృత్యువు తనకేదో భ్రమ కలిగించినట్టున్నది.

అకస్మాత్తుగా గుర్రం ఆగిపోయినట్టయింది. తాను చావలేదు! దొంగ కళ్ళు తెరిచి చూసి, తాను గుర్రంతోసహా కోట గోడ పైభాగంమీద ఉన్నట్టు తెలుసుకున్నాడు. ఆ అద్భుతమైన గుర్రం గోడకు కొట్టుకోక చెంగున ఎగిరి గోడ పైభాగాన్ని అందుకున్నది!

గజదొంగకు పోయిన ప్రాణం తిరిగి వచ్చినట్టయింది. తన గుర్రం ఇంత శక్తి గలదని వాడు కలలో కూడా అనుకోలేదు. కోట గోడమీదికి ఎగిరిన గుర్రం గోడ దూకటం ఒక లెక్కా. గజదొంగ తన గుర్రాన్ని ప్రోత్సహించి కోటగోడ వెలపలికి దూకించాడు. కోట వెలపలి కందకం దాటేలాగ దూకి ఆ గుర్రం తన యజమానితోసహా అడవిలోకి వెళ్ళిపోయింది.

రాజభటులు కోట వెలపలికి వచ్చేసరికి గజదొంగ జాడగాని, అతని గుర్రం జాడ గాని లేదు.






మళ్ళీ పౌర్ణమి వచ్చింది. వెన్నెట్లో తాతయ్య పడకకుర్చీలో కూచుని పొడుంకాయ తీస్తూ ఇలా తనలో తాను చదువుకున్నాడు:

"మానభంగః పరకృతో
మానినాం మంగళావహః,
అనంతో మానభంగేన
పాండిత్యం పరమం గతః."

తాతయ్యచుట్టూ మూగిన పిల్లలు ఆయన పొడుంపట్టు పట్టి పీల్చేలోపలనే, "అంటే ఏమిటి, తాతయ్యా?" "అదికూడా కథేనా, తాతయ్యా?" "కథ చెప్పు, తాతయ్యా," అని గోల చేశారు.

పొడుంకాయ రొండిన దోపుకుంటూ, "ఆ శ్లోకానికి అర్థమేమిటంటే: మానాభిమానాలు కలవాళ్ళుంటారు చూశారా? అలాటి వాళ్ళకు మానభంగం కలిగినప్పటికీ మేలే జరుగుతుంది; వెనకటికి అనంతుడనే వాడు అవమానం పొందిన కారణంగా గొప్ప పండితు డవలేదా, అని!" అన్నాడు.

"అనంతు డెవరు, తాతయ్యా?" "ఏం అవమానం జరిగింది, తాతయ్యా?" అని పిల్లలు మళ్ళీ అడిగారు.

"అరవకుండా కథ వినండర్రా—అన్నీ మీకే తెలుస్తాయి!" అంటూ తాతయ్య ఇలా కథ చెప్పాడు:

చోళదేశంలో ఒక పండిత కుటుంబం ఉండేది. అందులో కేదారభట్టూ, మహానందిభట్టూ, అనంతభట్టూ అని ముగ్గురు అన్నదమ్ము లుండేవారు. ముగ్గురూ భార్యలతో కాపురాలు చేస్తున్నవాళ్ళే. అనంతభట్టు అన్నలే గాక, వారి భార్యలూ, అనంతభట్టు భార్యాకూడా సంస్కృతంలో ధారాళంగా మాట్లాడేవారు. ఒక్క అనంతభట్టుకే సంస్కృతం బొత్తిగా రాదు. వాడు తెలివి తక్కువవాడు కాడు సుమా, సోమరిపోతు. అందుచేత వ్యాకరణం చదువుకోకుండా

తాతయ్య కథలు:—6

రచన: సి. శేషాద్రి

విని పట్టుకున్న సంస్కృతం మాటలు తన ఇష్టం వచ్చినట్టు మాట్లాడేస్తూండేవాడు.

ఒకనాడేమయిందనుకున్నారూ? అందరూ భోజనాలు చేస్తున్నారు. అనంతుడు పెరుగు తెమ్మని అడిగే ఉద్దేశంతో పెళ్ళాంతో, "దధిమానయ," అన్నాడు. అందరూ గొల్లున నవ్వారు. ఎందుకో తెలుసా? "పెరుగు తీసుకురా" అనాలంటే "దధి-ఆనయ" లేకపోతే "దధ్యానయ" అనాలి. ఆ సంగతి అనంతుడికి తెలీదు.

అప్పుడు అనంతుడి భార్య ఏంచేసిందో తెలుసా? ఆ అమ్మాయి మంచి పండితురాలు మరి! తన భర్తను చూసి అందరూ నవ్వారని కష్టంవేసి, "మీరంతా ఎందుకు నవ్వుతున్నారు? ఆయన సరిగానే చెప్పారు. దధి మానయ అంటే దధి-మా-ఆనయ; 'పెరుగు తేవద్దు, మజ్జిగ తీసుకురా' అని ఆయన ఉద్దేశం," అంటూ మజ్జిగ తెచ్చి భర్తకు వడ్డించింది.

"మొగుడు కొట్టినందుకు గాదు, తోడికోడలు నవ్వినందుకు" అని సామెత చెబుతారు. చూశారా? ఆ విధంగా అనంతుడుకి, "నన్ను నా పెళ్లాం సమర్థించటమా?" అని అభిమానం పుట్టుకొచ్చింది.

ఆ అభిమానంకొద్దీ వాడు ఒకనాటి రాత్రి ఎవరికీ చెప్పకుండా కాశీ చక్కాపోయి, అక్కడ పట్టుదలతో గొప్ప గొప్ప పండితుల దగ్గిర సకల శాస్త్రాలూ క్షుణ్ణంగా చదువుకుని, ఎన్నో దేశాలు తిరిగి, ఎందరో రాజుల ఆస్థానాలలో అంతు లేని పండితులను ఓడించి, కంకణాలూ, బిరుదులూ, బహుమానాలూ, కానుకలూ పుచ్చుకుని మరీ ఇంటికి తిరిగి వచ్చాడు....

"చూశారా, అభిమానం ఉండబట్టేగదా అనంతభట్టు ఒక్కసారి మానభంగం పొందిన కారణంగా, పట్టుదలతో శాస్త్రాలన్నీ చదివి, అంత గొప్ప పండితుడయాడు!" అన్నాడు, తాతయ్య.



# చార్‌మినార్



ఆంధ్ర రాష్ట్రానికి రాజధాని అయిన హైదరాబాదు నగరం భారతదేశంలోని మహాపట్టణాలలో అయిదవది. దీని నిర్మాణం సుమారు 370 ఏళ్ల క్రితం జరిగింది. దీనిని నిర్మించినవాడు మహమ్మద్ కులీ కుతుబ్ షా అనే గోలకొండ నవాబు. ఆయన తన పత్నులలో తనకు అత్యంత ప్రియతము రాలైన భాగ్యమతి అనే ఆమె పేర ఈ నగరానికి భాగ్యనగరు అని నామకరణం చేశాడు. ఇది నిజాముల పరిపాలన ఆరంభమైనప్పటి నుంచీ వారికి రాజధాని అయింది.

హైదరాబాదు నగరం మధ్యను చార్‌మినార్ అనే కట్టడం ఉన్నది. చార్ మినార్ అంటే నాలుగు స్తంభాలు. చార్‌మినార్ స్తంభాలు 180 అడుగుల ఎత్తుగలవి. మహమ్మద్ కులీకుతుబ్ షా హయాంలోనే ఇక్కడ ప్లేగువ్యాధి విజృంభించి అణిగి పోయాక 1591 లో ఆయన ఈ అందమైన కట్టడాన్ని కట్టించాడు. ఇదికూడా మన దేశంలోని ప్రసిద్ధ కట్టడాలలో ఒకటి.

# సిగ్గు చేటు

చీనాలో అవంతి అనే ఒక విదూషకుడి ఇంట్లోకి ఒక రాత్రి దొంగ ప్రవేశించాడు. ఈ సంగతి కనిపెట్టి అవంతి ఒక పెట్టెలో దాక్కున్నాడు.

దొంగవాడు ఇల్లంతా సోదాచేసి చిట్టచివరకు పెట్టె దగ్గిరికి వచ్చాడు. పెట్టెమూత తెరిచి చూసేసరికి దొంగవాడికి పెట్టెలో దాక్కున్న అవంతి కనిపించాడు.

"ఇదేమిటి? పెట్టెలో దాక్కున్నావు?" అని దొంగ అవంతిని అడిగాడు.

"ఏం చెయ్యమంటావు? నీకు పనికివచ్చేది ఈ కొంపలో ఒక్కటీ లేనందుకు సిగ్గుపడి, నీ మొహం చూడలేక ఇలా దాక్కోవలిసి వచ్చింది," అన్నాడు అవంతి.



## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

1961 మార్చి సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు





★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ జనవరి నెల 10-వతేదీ లోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:- చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

## జనవరి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : 'నువ్వు పలికితే....

రెండవ ఫోటో : ....నేను గిలుకుతా'

పంపినవారు : కె. ఎస్. రామచంద్రరావు,

మలకాపురం P. O., (వయా) జగ్గయ్యపేట, (కృష్ణాజిల్లా.)

బహుమతిమొత్తం రు. 10/- ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.



# ప్రశ్నోత్తరాలు

1. యలమంచిలి రాధ, ఏలేశ్వరం

అందమైన "చందమామా", నీవు జన్మదినానికి కన్నా దీపావళికి ఎక్కువ అందంగా, సుందర వర్ణములతో తయారయ్యావ్. ఏమిటి కారణం, మామా?

పండక్కి చక్కగా అలంకరించుకుని ఉండే మీ మధ్యకు మామూలుగా రావటమంటే సిగ్గుగా ఉండదా, కోడలా?

2. డి. సి. అప్పారావు, పెద్దవాల్తేరు

"చందమామ"లో వేసే ఫొటోలు ఎవరైనా పంపవచ్చునా?

పంపవచ్చును. ఫొటోగ్రాఫర్లు పంపే బొమ్మలనుంచి వీరి మంచివే "చందమామ"లో నెలనెలా వేస్తున్నాము.

3. ఎమ్. లక్ష్మణ్ రావు, సైదాపూర్

దీపావళి సంచికలో అట్టమీది బొమ్మ, అట్ట వెనుక బొమ్మ వేశారు. వాని కథలు ఎందుకు వేయలేదు?

ప్రత్యేక సంచికలకు అట్టలమీది బొమ్మలు కూడా ప్రత్యేకంగానే ఉంచటం "చందమామ"కు ఆచారంగా వస్తున్నది.

4. దంగేటి చిన్నమ్మాయి, విశాఖపట్నం

పాలసముద్రమున ఉద్భవించిన అమృతమునకు రుచి, వాసన, రంగు, రూపము ఎలా వున్నదో కాస్త వివరించి చెబుతారా?

ఆ మోహిని ఆ అమృతాన్ని కాస్త మాకుకూడా పోస్తే అలాగే చెప్పి ఉందుము, చిన్నమ్మాయ్!

5. వి. విశ్వనాథం, శ్రీకాకుళం

ఒక కార్డుమీద (ఫొటో) వ్యాఖ్యల పోటీకి ఎన్ని జతల వ్యాఖ్యలైనా పంపవచ్చునా? ఒక కార్డుమీద ఎన్ని ప్రశ్నలైనా పంపవచ్చునా?

రెంటికీ ఒకే సమాధానం—పంపవచ్చును.. కాని కొందరు పాఠకులు ఒకే కార్డులో ఫొటో వ్యాఖ్యలూ, ప్రశ్నలూ పంపుతున్నారు. ఇందువల్ల వారికే నష్టం. ప్రశ్నలు పంపే కార్డుపైన ఫొటో వ్యాఖ్యలు దయచేసి పంపకండి.

6. *కె. జడలయ్య, మహబూబ్‌నగర్*

అన్నయ్యా, చంద్రమండలములో "చందమామ" ఏజెంటుగా ఉండాలనుకున్నాను.

శుభం! చంద్రమండలంలో మీ ఎడ్రసు తెలిపితే ఏజెన్సీ ఖాయం చెయ్యగలం!

7. *ఎన్. వి. కృష్ణారావు, నెల్లూరు*

దీపావళి సంచిక [ప్రశ్నోత్తరాలు]లో మీ పత్రికలో కథ వేయుటకు సభ్యత్వమవసరము లేదని చందా కట్టినచో అర్హులని చదువుకొంటిని....

దీపావళి సంచికలోని 2-వ ప్రశ్నకు మా జవాబును ఇంకొక పాఠకుడు కూడా ఇదే విధంగా అపార్థం చేసుకోవటం మాకు తెలియవచ్చింది. ఆ జవాబు అపోహకు తావిచ్చినందుకు విచారిస్తున్నాం. "చందమామ"కు రచనలు పంపటానికి చందాదారులు కావలిసిన అవసరం ఏమీ లేదు. "చందమామ"కు చందాదార్లే తప్ప మరొక రకం సభ్యులు లేరని చెప్పటమే మా ఉద్దేశం. చందాదారు కాకపోయినా రచనలు పంపవచ్చును.

8. *జి. రాజరాజేశ్వరీదేవి, బిట్రగుంట*

అన్నయ్యా, మన భారతదేశము అమెరికా, రష్యాలాగ సకలైశ్వర్యములతో యెప్పుడు తులతూగును?

ప్రజలందరూ సంపదను పెంపొందించటానికి సర్వశక్తులూ ధారపోసి, కొన్ని దశాబ్దాలు శ్రమించినట్టయితే మనదేశం కూడా సకలైశ్వర్యాలతో తులతూగుతుంది.

9. *సి. హెచ్. శ్రీనివాసరావు, భీమటాంగరు, సుకిందా*

అన్నయ్యా! "చందమామ" స్వర్ణోత్సవ మెప్పుడో తెలియజేసెదవా?

1997 జూన్ 25 న "చందమామ" స్వర్ణోత్సవం జరుగుతుంది. మీ కందరికీ ఆహ్వానాలు వస్తాయి!

10. *టి. కృష్ణస్వామి, హైదరాబాదు*

అన్నయ్యా, శంకర్, చిత్రాగార్లకు నా ధన్యవాదాలు చెబుతావా?

చెప్పేశాను, తమ్ముడూ!

# చిత్రకథ





ఒకరోజున దాసూ, వాసూలను గొర్రెలు కాచే కుర్రవాడు చిరుతపులిని చూశారా అని అడిగాడు. వాళ్ళు చూడలేదన్నారు. దానికి వాడు పెద్దగా నవ్వి; రాత్రి గొర్రెలను ఎత్తుకుపోవటానికి వచ్చిన ఒక చిరుతపులిని తాను పట్టుకున్నాననీ, పొదల దగ్గిరకు వచ్చి, చూడవచ్చనీ అన్నాడు. దాసూ, వాసూలు చిరుతపులిని చూసి తారుకున్నారు. కాని, ఈలోపల 'టైగర్' పొదల చాటుగా వెళ్ళి చిరుతపులి కాలు పట్టుకున్నది. అది 'బే బే' అంటూ పారిపోసాగింది. గొర్రెపోతుమీద నల్లటి మచ్చలు గల బట్ట కప్పి, దాసూ వాసూలను బెదరగొట్టాలనుకున్న గొర్రెల కుర్రాడు, కేకలు పెడుతూ పారిపోయే గొర్రెపోతు వెంట పడ్డాడు.






Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd., and Published by B. VENUGOPAL REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'






Kashmir







సంక్రాంతి విడుదల!







అన్నపూర్ణా వారి....

# వెలుగు నీడలు



నిర్మాత: D. మధుసూదనరావు. B.A.

దర్శకుడు: ఆదుర్తి సుబ్బారావు







నవయుగ రిలీజ్

Photo by A. Krishnamurty



బహుమతి
పొందిన వ్యాఖ్య

"... నేను గిల్లుకుంటా!"

పంపినవారు:
K. S. R. రావు - మలకాపురం

